# శ్రీ గౌరీ వివాహము

పదకావ్యము



ఇది

శ్రీరాజా మృత్యుంజయ నిశ్శంకబహద్దరు
సంగంవలస జమీన్దారుగారిచేత
విరచింపఁబడి

శ్రీమన్మహామహోపాధ్యాయ శ్రీమత్ప
రవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలు
గారిచే పరిశీలనామోదములనొంది

వైశాఖపట్టణమునందలి
ఆర్ష ముద్రాశాలయందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడియె
శాలివాహనశకాబ్దంబులు ౧౮౧౭
A. D. 1895 సం॥ ఫిబ్రవరి 19ది
శ్రీజయనామసం॥ మాఘ బ[illegible] మంగళవారము

1895
Arsha Press Vizagapatam
Publisher S. P. S. Jagannathaswamy
Ayyavaralugaru
Printer D. Guranna.



శ్రీరామ-
శ్రీరస్తు.
శ్రీశుభం భవతు-
అవిఘ్నమస్తు-
శ్రీనాయగురవేనమః

# శ్రీ గౌరీవివాహః

ప్రథమాశ్వాసప్రారమ్భః॥



శ్రీశివాశితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమునబ్రోవు॥
విఘ్నములురాకుండ విఘ్నరాజునుదలఁచి।
భారతికిభక్తితో ప్రణతులొనరింతు॥ శ్రీశివా॥ ౧॥
విష్ణుముఖదేవులకు వినయనతులొనరించి।
వేంకటరంగగురు వినుతింతుమదిని॥ శ్రీశివా॥ ౨॥
సంగమవలసేశ సకలలోకాధీశ।
విశ్వేశ్వరస్వామి విఖ్యాతనామా॥ శ్రీశివా॥ 3॥
ఇలనెందువంశమున నెలమితోబేరొందిన్న।
నియతమృత్యుంజయ నిశ్శంకనృపతి॥ శ్రీశివా॥ ౪॥
నీకంకితంబుగా నేనేర్చురీతిచే।

గౌరీవివాహంబు కథనుగా జేతు॥ శ్రీశివా॥ ౫ ॥
మును భారతమునందు మునులు చెప్పినరీతి ।
పరిణయవివరణ బరికించి చెపుదు॥ శ్రీశివా॥ ౬॥
ఉత్తరదిశయందు నుత్కృష్టమై వెలయు ।
హిమవంతమను పేరనమరు నగమొకటి॥ శ్రీశివా॥ ౭॥
దేవతాస్థానమై తేజరిల్లుచునుండు ।
పుష్పఫలారామపూర్ణమై యొప్పు॥ శ్రీశివా॥ ౮॥
స్థలజలజంబుల సలలితంబై యొప్పు ।
సర్వఫలవృక్షముల సరణిజెన్నొందు॥ శ్రీశివా॥ ౯॥
కస్తూరిజవ్వాది ఘనమైన వాసనలు ।
గుప్పరిల్లుచునుండు నెమ్మిమీరగను॥ శ్రీశివా॥ ౧౦॥
అఖిలజనంబులు నతివేడ్కగొనియాడు ।
నత్తనికి మేనక యనుపత్నిగలదు॥ శ్రీశివా॥ ౧౧॥
ఆమెప్రాగ్జన్మమున నమరినఫలముచే ।
డాహ్లాదచిహ్నముల్ దగదాల్చియుండె॥ శ్రీ॥ ౧౨॥
మెలతలానందింప మేనకాదేవికిని ।
పుత్రికారత్నంబుపుట్టి వర్ధిల్లె ॥ శ్రీశివా॥ ౧౩॥
అంతటహిమవంతు డానందమగ్నుడై ।
భూరిసంభావనల్ భూసురులకిచ్చె॥ శ్రీశివా॥ ౧౪॥
నామకరణముచేసియ నగరాజుమోదించి ।

బంధుజనులను జూచి పలికె మోదమున ॥శ్రీశి॥౧౪॥
పేరుబెట్టగవలయు పెద్దలందఱుగూడి।
యనుచు బ్రార్థనజేయ నాబంధుజనులు॥శ్రీ॥౧౫॥
పర్వతపుత్త్రి యైనది ప్రఖ్యాత గాపున నీమె।
పార్వతియనుపేరు ప్రకటనంబు చేసిరి ॥శ్రీశివా॥౧౬॥
తమ పరిను మయని తల్లిదండ్రుల చేత।
తగనొందె నామంబు తరుణీలలామ ॥శ్రీశి॥౧౭॥
అగజసోదరుడైన యామైనాకుండు।
నబ్ధితో సఖ్యంబు నమరంగ జేసె ॥శ్రీశివా॥౧౮॥
తల్లిదండ్రులకును దనివి రెట్టింపంగ।
తగువిద్యములు సేసె తరుణీనవ్వుచును ॥శ్రీ॥౨౦॥
జలిబిలిమాటలను జెలువొంద వాడుచును।
ముదితలతో దాను మూతలాడుచును ॥శ్రీశి॥౨౧॥
మువ్వల మురిడీలు మోయంగ నందెల।
మురిపెంపునడలచే ముద్దుగుల్కుచును॥శ్రీశి॥౨౨॥
చిరుతప్రాయంబునకు జెలువౌనలంకృతుల్।
చిన్నారి ధరియించి చెలులతో నాడె ॥శ్రీశి॥౨౩॥
నీటుగా బాల్యంబు నివ్వటిల్లగనంత।
యతివకును యౌవనం బమరి వెలకెక్కె॥శ్రీ॥౨౪॥
మెరుపుతీగ నడాలె మెలత మెయికాంతిచే।

చంద్రునిగేరెను చానవెమ్మోము ॥ శ్రీశివా ॥ ౨౫ ॥
కలువరేకులబోలె కలికికన్నులతీరు।
శ్రీకారములబోలె చెలియకర్ణములు ॥ శ్రీశి ॥ ౨౬ ॥
సంపెంగమొగ్గకు సాటియౌనవచ్చు।
కాంతిచేజెలువొందె కాంతనాసికయు ॥ శ్రీ ॥ ౨౭ ॥
గళముశంఖమురీతి కమనీయమైయొప్పె।
పూలదండలనెన్నె పొలతిబాహువులు ॥ శ్రీ ॥ ౨౮ ॥
పొలతికిచనుదోయి పొడజూపెపొలయలుగ।
పొక్కిలిసురపొన్న పూబోలియలరె ॥ శ్రీశి ॥ ౨౯ ॥
గరితకు మధ్యంబుగగనమైయొప్పెను।
ఇసుకదిన్నెలబోలెనింతిజఘనములు ॥ శ్రీశివా ॥ ౩౦ ॥
అరటిబోదెలబోలె నతివపెందొడలెన్న।
వరిపొట్టలనుమీరె వనితజంఘికలు ॥ శ్రీశి ॥ ౩౧ ॥
కమఠంబులనుబోలె కలికిప్రపదంబులు।
పదములుపద్మసంపదలజెన్నొందె ॥ శ్రీశివా ॥ ౩౨ ॥
నక్షత్రకాంతిచే నఖములుభాసిల్లె।
నెలకళల్బోలిన నెలతవర్ధిల్లె ॥ శ్రీశివా ॥ ౩౩ ॥
ఈరీతిశ్రీగౌరి హిమవంతుదరినుండ।
నతితోడయుక్తుడై నగరాజునలరె ॥ శ్రీశివా ॥ ౩౪ ॥
వీణాపాణినిబూని విష్ణుసంకీర్తనలు।

నానెమూఁగ జేయుచును నారదుఁడువచ్చె॥శ్రీశి॥ ౩౫॥
వచ్చినమౌనిగని పరభక్తియుక్తుఁడై।
పూజానమస్కృతుల్బాంచుగా జేసె॥శ్రీశి ॥౩౬॥
అమితసంతుష్టుఁడై యామౌనివర్యుఁడు।
ఆశీఃపరంపర లలరంగజేసె॥శ్రీశివా॥౩౭॥
ఈగిరిజాదేవి నీసుదుబెండ్లాడి।
తనయర్ధదేహంబు తప్పకను జేయు॥శ్రీశివా॥౩౮॥
అనినారదుఁడుపలికి యరిగెనదృశ్యుఁడై।
యదివిని హిమవంతుఁడానందమొందె॥శ్రీశి॥౩౯॥
ఆగౌరిదేవియును నతిసంతసమునొంది।
చెలికత్తెలనుజూచి చెలిమినిట్లనియె॥శ్రీశివా॥౪౦॥
శశిధరుండెక్కడ సకియనేనెక్కడ।
ననుజేయుటెక్కడ నాఁరోవినవె॥శ్రీశివా॥౪౧॥
అనివిరహార్తయై యాపార్వతీదేవి।
శివునిచిత్తమునందుస్థిరముగానిలిపె॥శ్రీశివా॥౪౨॥
అంతట శ్రీశంభుఁడాదక్షపుత్రిక।
నెడబాసినదిమొదలేమిత్రోచకను॥శ్రీశివా॥౪౩॥
ఉండిదాక్షాయణియుర్విధరేంద్రునకు।
తనపుత్రియైయుంటతానెరుంగుచును॥శ్రీశివా॥౪౪॥
ఆగిరితటమునసమరు నుపవనమందు।

దపముసేయంబూనెదగశంకరుండు॥శ్రీశివా॥౪౫॥
అవిగనిహిమవంతుడాత్మజాతనుజూచి।
యధికమోదముతోడనపుడిట్లులనియె॥శ్రీశి॥౪౬॥
నాచిన్నినెలతూన నాముద్దుతల్లి మా।
నికేళివనములో నీలకంఠుండు॥శ్రీశివా॥౪౭॥
తపముసేయగబూని తగనిచ్చెగావున।
తనిపరిచర్యలటివరోనీవు॥శ్రీశివా॥౪౮॥
సేయగావలయును శీతాంశుధరుసేవ।
సకలశుభంబులు చాలనీకొసగు॥శ్రీశివా॥౪౯॥
మునులసేవలుసేయు ముదితలునీసాటి।
వారలెగారెయన వనితయూహ్వాంగి॥శ్రీశివా॥౫౦॥
తనమదికోరెకలు తగదీర్చుహరుడని।
హర్షంబుతోడుత నాయుమాదేవి॥శ్రీశివా॥౫౧॥
బాలచంద్రునిబోలు ఫాలప్రదేశమున।
కస్తూరితిలకంబుక్రమముగాదిద్ది॥శ్రీశివా॥౫౨॥
కన్నులకాటిక కమనీయముగనుంచి।
మేల్కావిరవికను మేలుగాదొడగి॥శ్రీశివా॥౫౩॥
జిలుగుబుటేదార్ల చీరెహొయలుగగట్టి।
ఆభరణభూషితమై చెలువుమీర॥శ్రీశివా॥౫౪॥
వచ్చిశంకరుగాంచి హెచ్చుమోహముచేత।

ఆనందభరితయైయాగౌరిదేవి॥శ్రీశివా॥౪౪॥
నెచ్చెలిచాటున నీటుగానిలచుండి।
కరయుగంబులుమోడ్చిహరునిసేవించి॥శ్రీశి॥౪౬॥
నీలకంఠునిదరినినిల్చు నెలతనుజూచి।
ఆశ్చర్యమునుబొందియాభృంగియనియె॥శ్రీశి॥౪౭॥
స్వామిదేవరవారి సాన్నిధ్యమునకు।
లావణ్యవతివచ్చె లలితముగనిల్చె॥శ్రీశివా॥౪౮॥
తపమువిఘ్నముసేయదలచినట్లున్నది।
వామదేవమహాశవనమువెడలింతు॥శ్రీశివా॥౪౯॥
అనవిని భృంగికి నామహేశుండనియె।
పరిచర్యసేయను పణతిదావచ్చె॥శ్రీశివా॥౫౦॥
అనవినియాభృంగి యతివినయంబుతో।
బరమేశ్వరునిజూచి పలికెనిట్లనుచు॥శ్రీశివా॥౫౧॥
వెరచినేజెప్పెద వినుముమహాదేవ।
కమలాక్షితోగలసి కరుణదప్పెదరో॥శ్రీశి॥౫౨॥
అనివిన్నవించిన యాభృంగినటుజూచి।
చిరునవ్వుమోముతో శివుడప్పుడనియె॥శ్రీశి॥౫౩॥
అంతపనేలగు నతివపరిచర్యలను।
చేయనిమ్మనుచును సెలవిచ్చెనంత॥శ్రీశివా॥౫౪॥
అనుపమవేషమై యాపార్వతీదేవి।

పరిచర్య నెపముచే చరిజేరియుండె॥ శ్రీశివా ॥౬౫॥
అతిమనోహరమైన యతివసౌందర్యంబు।
సరసిచూచుచుమోహమందతి మోహమొందె॥ శ్రీ॥ ౬౬॥
హృత్వంతరము లుండు హెరిగి శ్రీశంకరుడు।
సాత్త్విక భావమును సడలంగజేసె॥ శ్రీశివా॥ ౬౭॥
ఆసమయంబుననమరు లింద్రుని గూడి।
యజునితోనరి వారతిసంభ్రమమున ॥ శ్రీశివా౬౮॥
లోకేశ యీ రేడు లోకములు బాధించు।
తారకాసురుద్రుంచి తగరక్షసేయు॥ శ్రీశి ॥ ౬౯॥
అనివిన్నవించిన నాబ్రహ్మదేవుడు।
పలికెనిట్లనుచును భావించిమదిని ॥ శ్రీశివా॥ ౭౦॥
పార్వతీశ్వరులకు బరగపుత్రుడుబుట్టి।
తారకాసురునణచు తథ్యంబుగాను ॥ శ్రీశి॥ ౭౧॥
కావున వారల గలయునట్లొనరించి।
శాంతులీడేరును ఘనులారవినుడి ॥ శ్రీశివా॥ ౭౨॥
అవిననింద్రాదులు నతివేడుకలనొంది।
మన్మథురాకను మదిగోరిరపుడు ॥ శ్రీశివా॥ ౭౩॥
మదనుడింద్రునియాజ్ఞ మన్నించి వేగమున।
రాచిలుక బూనిన రథమధిష్ఠించి ॥ శ్రీశివా॥ ౭౪॥
సతిరతీదేవియును సరసనుగూర్చుండ।

పరసోక్తులాడుచు నవిలాసుడగుచు॥ శ్రీశివా॥ ౨౫॥
వచ్చియుండ్రిగాంచి వరనసుసారకములు।
గావించిరతిశచి కడనుంచెనంత॥ శ్రీశివా॥ ౨౬॥

అమరేంద్రుడటమోద మందియామునకు।
నర్ఘాసనంబిచ్చి యతని శుభమడిగి॥ శ్రీశి ॥ ౨౭॥
మానోక్తులాడిన మదనుడెందు నిజాంచి।
యతివినయంబుతో నపుడిట్టులనియె। శ్రీ ॥ ౨౮॥
నీకరుణగలిగిన నిజముదుర్గిండమైన।
యలగిననాకేమియశుభ యంబనిన॥ శ్రీశివా॥ ౨౯॥

వినుమునావిన్నపము విశదీకరించెద।
తారకాసురుడను దైత్యుడుగలడు॥ శ్రీశివా॥ ౩౦॥
వానినివధియింప వశము గాదెవ్వరికి।
శివునికొమరుండైన సేనానిదక్క॥ శ్రీశివా॥ ౩౧॥
కావుననుమతోడ గలియంగహరుగూర్ప।
నిన్నుగోరితిమిది నిశ్చయంబుగను॥ శ్రీశివా॥ ౩౨॥
ఇట్టు గావించిన నీపరిణయఫలము।
శిష్టరక్షణనీకు సిద్ధముగగలుగు॥ శ్రీశివా॥ ౩౩॥
అనినవినికందర్పు డతిమతయుక్తుడై।
పాకశాసనునితో బలికె మోదమున॥ శ్రీశివా॥ ౩౪॥

అలవసంతుని సహాయము గొనియే గద।
శివయుశివుడునుగల్గు సిద్ధవనమునకు॥ శ్రీశివా॥ ౭౪॥
పరివారుభయయుల నేకముగజేసెదను।
నాపరిశరమున నాత్రాణగనుము॥ శ్రీశివా॥ ౭౫॥
అనిమీసమెగవేసి యాయింద్రునకు మ్రొక్కి।
చనియె సౌధంబునకు సతితోడగూడి॥ శ్రీశివా॥ ౭౬॥
శయ్యపై శయనించు సమయంబున రతి।
చెక్కుటచేయి జేర్చి చింతించి పలికె॥ శ్రీశివా॥ ౭౭॥
ప్రాణేశ నామనవి బాగుగావినవయ్య।
బలవద్విరోధంబు బాగుగా దెపుడు॥ శ్రీశివా॥ ౭౮॥
హరునితపోవిఘ్నమయిన మేలించునకు।
మనకేమికీడైన మాన్పలేడతడు॥ శ్రీశివా॥ ౮౦॥
సామాన్యదేహరుడు సకలదేవార్చితుడు।
హరియంతవాడతడరసి మానగను॥ శ్రీశివా॥ ౮౧॥
మనకేమిసేమమని మానిని మ్రొక్కెనొక।
పుష్పబాణుండపుడు ప్రాణేశకనియె॥ శ్రీశివా॥ ౮౨॥
భామినీ యీపట్టి భ్రమమానుమేమమున।
గానిమ్ము దేవతల కార్యమునుమాన॥ శ్రీశివా॥ ౮౩॥
అనినా రతిదేవి మనమున నమ్మకొనె।

కాగలకార్యములు గాకపోవనుచు॥ శ్రీశివా॥ ౯౪॥
పతిమాట కెదురాడ బనియేమి లేదని।
పతి చెంత దానపుడు పవళించి యుండె॥ ౯౫॥

శ్రీశివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా॥
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥





శ్రీరామ.

శ్రీరస్తు.

శ్రీశుభం భవతు.

అవిఘ్నమస్తు.

శ్రీసాంబగురవేనమః.

# శ్రీగౌరీవివాహః

## ద్వితీయాశ్వాసప్రారమ్భః.

శ్రీశివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥

అంతప్రభాతమునందు మేలుకొని మరుడు।
పయనమై వెడలెదన పత్నితో కూడ॥ శ్రీశివా॥ ౧॥
ఒంటిబాపడువలె నొప్పుచునుదయించె।
వేగుచుక్కప్పుడు పిథివశముగాను॥ శ్రీశివా॥ ౨॥
దీనతగలరతి దేవియాననమున।
చంద్రబింబముతొంటిచాయ సెకలరె॥ శ్రీశివా॥ 3॥
అరుణోదయంబున నలరువిల్తుడు జనె।
హరువాశ్రమంబున కతివేగమునను॥ శ్రీశివా॥ ౪॥
అంతవసంతుడు నలరువిల్తుగూడి।

ఆవనమునందు విహారములు సలిపె॥ శ్రీశివా॥ ౫॥
ఆసమయమునందు నలరులుః కసించె।
శుకపికధ్వనులచే శోభజెన్నొందె॥ శ్రీశివా॥ ౬॥
మలయమారుతము మందముగావీచె।
మధుకరములరొదల్ మానుగాహెచ్చె॥ శ్రీశి॥ ౭॥
అప్పుడప్పార్వతి యనుగుచెలులైయున్న।
కలవాణి నవమాలి కలత్రాడగూడి॥ శ్రీశివా॥ ౮॥
వనకేళిజేయుచు దనచెలులనుజూచి।
హరుసేవకాలస్య మాయెగాయనిన॥ శ్రీశివా॥ ౯॥
కలవాణినవమాలికలు చిరునవ్వుతో।
ననిరిగౌరినిజూచి యతివేడ్కలలర॥ శ్రీశివా॥ ౧౦॥
అతిసుందరంబైన యాయీశుదయజెంది।
మెలగినమేలగు నెలతరో వినవే॥ శ్రీశివా॥ ౧౧॥
మావంటిచెలులతో మరియేమిపనిలేదు।
ఈశునిచెంగట నెలమితో మెలగు॥ శ్రీశివా॥ ౧౨॥
మేమున్నదిమంచి మేలనియుంటిమి।
నీమదికోరికల్ నిజముగాదెలసి॥ శ్రీశివా॥ ౧౩॥
అనిమేలమాడిన యాచెలులనుజూచి।
చిడుముడిపాటున చెలియదాననియె॥ శ్రీశివా॥ ౧౪॥
నేనెవ్వరికిపనుల్ నేర్పునజేయంగ।

జాలనుజనిమెద జననిసన్నిధికి॥ శ్రీశివా॥ ౧౫॥
అనిపైటజీరాడ నతివేగజను చెలి।
చేయిబట్టినిలిపియా చెలియచానని యె॥ శ్రీ॥ ౧౬॥
కలవాణిమాటల కలిగిజనమందిదా।
హాస్యంపుమాటలకాగ్రహముదగునా॥ శ్రీశి॥ ౧౭॥
శంకరుపరిచర్య పంకముగజేయుమని।
సీతంద్రినిను వేడ్క నియమించియుండె॥ శ్రీశి॥ ౧౮॥
కావునగురునాజ్ఞ కనుమీరియుండుట।
తగదునీకెప్పుడు తరుణివినమ్మ॥ శ్రీశివా॥ ౧౯॥
అనుచుమబోధించి యంబికాదేవిని।
శశిధరుసేవకు సమకూర్చిరంత॥ శ్రీశివా॥ ౨౦॥
పార్వతిశంభుని పజ్జ 'కుజ' నుండెంచి।
జడవిప్పయత్నించి జంకెగంగకును॥ శ్రీశివా॥ ౨౧॥
మేనబూసినభూతి మేలుగామదువబో।
భోగిభూతర్కృళులకుభూరిభయమొందె॥ శ్రీ॥ ౨౨॥
గళనైల్యమునుదుడువ గాబోయిభీతిలై।
పుణికెలపేరులను బొందుగాజూచి॥ శ్రీశివా॥ ౨౩॥
వలువకాగప్పను వనితయాలోచించి।
పులిచర్మమునుజూచిబలుభీతినొందె॥ శ్రీశివా॥ ౨౪॥
పరితినైనమ హేశునిమోయినంట।

నలవిగాకపుడుండె నలినాయతాక్షి ॥ శ్రీశివా ॥ ౨౫ ॥
అయినచో నెటులుండు వాఁడు పతివివ్వచే।
దపము సేయుచును దానుపవనమునందు ॥ శ్రీశి ॥ ౨౬ ॥
ఈశసిజపమాల నింతిదాధరియించి।
తనతారహారమును దనరనందిచ్చె ॥ శ్రీశివా ॥ ౨౭ ॥
ఇదితరియనియెంచి పదనుండునీశుపై।
వడి నేసెసుమబాణవర్గమింపొంద ॥ శ్రీశివా ॥ ౨౮ ॥
చలితమనస్కుడై శంభుండుయోచించి।
యలరువిల్తుదహించెనగ్ని నేత్రమున ॥ శ్రీశివా ॥ ౨౯ ॥
ఆసమయమునందు నావసంతుఁడు బారె।
ఆశలెల్లను జెదిరె నాపక్షిచయము ॥ శ్రీశివా ॥ 30 ॥
అంతటహిమవంతు డతిభీతియుక్తుడై।
తనపుత్రిపార్వతిని దగదోడితెచ్చె ॥ శ్రీశివా ॥ 3౧ ॥
కడువేడుకను మేన కాదేవియొద్దను।
నునిదియప్పుడు దైన్యమునను౦డిరంత ॥ శ్రీశి ॥ 3౨ ॥
ఆరతిదేవియువార్తస్వరముతోడ।
నవనిపైబొర్లుచు నతిదుఃఖపడుచు ॥ శ్రీశివా ॥ 33 ॥
శంకరుని శాంకరిని పొంకపర్చదలంచె।
శివునికేమపకృతి సిద్ధముగజేసె ॥ శ్రీశివా ॥ 3౪ ॥
పరమేష్ఠియాజ్ఞచే బరగనింద్రాదులు।

మచ్చరమెక్కించిమరుకాల్చిమరుని॥ శ్రీశివా॥ ౩౫॥
హరుకంటిమంటకునవ్వగించిరిగాని।
కావంగ శ్రేరైరి ఘమలుమమ్మిపుడు॥ శ్రీశివా॥ ౩౬॥
అమరేంద్రుడెక్కడ నావసంతుండేడి।
అహాహామమ్మునజూడ నైనరారైరి॥ శ్రీశివా॥ ౩౭॥
నేను పాతివ్రత్య నియతిచేనుగ్రముగ।
మూడులోకములు నిమూలముగ జేతు॥ శ్రీశి॥ ౩౮॥
అనియప్పుడాసాధ్వి మనమునజింతించి।
పరులనుహింసించపరహానియనుచు॥ శ్రీశివా॥ ౩౯॥
పతితోసహగమనంబు బాగుగాజేసిన।
కైవల్యపదవిని గాంచెదననుచు॥ శ్రీశివా॥ ౪౦॥
అగ్నిప్రవేశంబు నమరజేయగబూని।
అనలంబుదరిచేరి యారతీదేవి॥ శ్రీశివా॥ ౪౧॥
సకలలోకాధీశ సర్వేశ్వరాయని।
నాదేవునాజ్ఞచే నశరీరవాణి॥ శ్రీశివా॥ ౪౨॥
వనితరోనీకును వైధవ్యమిలలేదు।
అంగసంభూతుడనంగుడై వెలయు॥ శ్రీశివా॥ ౪౩॥
తానంగయుక్తుడై దగనీకునెప్పుడు।
గానవచ్చునుసుమ్ము కడుసుందరముగ॥ శ్రీశివా॥ ౪౪॥
మాంగళ్యలోపంబు మరినీకునెప్పుడు।

నాదుసుజ్ఞానఁచును రహిమీరఁబలికె ॥శ్రీశివా॥ ౪౫॥
అంతరతిదేవియు నతిముద మొందుచు।
తనకాంతుతోఁగూడితగసుఖంబుండె॥శ్రీశివా॥ ౪౬॥
అప్పుడప్పార్వతియునాత్మమనోరథ।
వికలత్వమునకయి వెతజెందిమదిని ॥శ్రీశివా॥ ౪౭॥
తనుసౌందర్యము డేలయరుదెంచి నాకేళి।
వనమునతపమును నొనరంగ జేసె ॥శ్రీశివా॥ ౪౮॥
పరిచర్యకై నేను పరమేశుదరి జేరి।
పతియత డేయనుచు భావించనేల ॥శ్రీశివా॥ ౪౯॥
అంతటమదనుండు నలరు బాణము లేయ।
వేలయాతనినణచె నీలకంఠుండు ॥శ్రీశివా॥ ౫౦॥
ప్రియునకునీరీతి ప్రేమలేకుండిన।
నారూపమదియేల నాదువయసేల ॥శ్రీశివా॥ ౫౧॥
అనిబహువిధంబులచే నకాంతయుండగా।
హరుడు కైలాసగిరి కరిగె వేగమున ॥శ్రీశివా॥ ౫౨॥
అరిగియే కాంతమున నతివిరహార్తుడై।
శయ్యపైవసియించసతిదలంపుచును॥శ్రీశివా॥ ౫౩॥
పరిపరివిధముల భావించిఖిన్నుడై।
హరుడుండ నాభృంగియుఁ యొనిట్లనుచు॥శ్రీశి॥ ౫౪॥
దేవరమీమనిఁ తీకుజాలిచినయంత।

కడుపికారంబుగా కాన్పించె నపుడు ॥శ్రీశివా॥౪౪॥
ఎన్నడు లేదిట్లు చిన్నబోవుటయేమి।
దాచక సెలవిమ్ము దయతోను సామి॥శ్రీశివా॥౪౫॥
అన భృంగిగని హరుం డనియె మత్కాంతతో।
కామిని నెడబాసి కంటిపికలతను॥శ్రీశివా॥౪౭॥
కనులగట్టిన యట్లు కాంత దోచుచునుండు।
గావున నే నెటుల గందు పార్వతిని॥శ్రీశివా॥౪౮॥
అనవిని యాభృంగి హాసంబుతో బలికె।
కాంతగాదది మహాకాళిగను దోచె॥శ్రీశివా॥౪౯।
గాకున్న నచటను గరిమతో నుండక।
నీటకేలపాడ కిట్లు చింత వేగమున॥శ్రీశివా॥౫౦॥
సామిమిమ్మునబట్టి సగము సేయకపోదు।
చిన్నెలును వన్నెలును చింతించి చూడ॥శ్రీశి॥౫౧।
ఏమట కానియా యింతి నెల్లయినను।
చూడక తాళనని శూలి యిట్లనియె॥శ్రీశివా॥౫౨॥
ఎద్దులవేషమున వేగి నెలతను జూచి।
వచ్చెదననిపలికె వామదేవుండు ॥శ్రీశివా॥౫౩॥
అనవిని భృంగియో యయ్యసేవకురాలు।
వలెనేనుమీవెంట వచ్చెదను సామి ॥శ్రీశివా॥౫౪॥
అనుచుం బల్కగ భృంగి నామహేశుడు చూచి।

యనిమోదానప్పుడుహర్షమలరంగ॥శ్రీశివా॥౬౫॥
నీవెఱ్ఱిమొఱ్ఱులను నీచేష్టలనుమాని।
చక్కగానుండుమనిముక్కంటియనిన॥శ్రీశి॥౬౬॥
వినవయ్యమనబిరుకై వెఱ్ఱిమొఱ్ఱిగనుండ।
మఱిమంచిచేష్టలు మనకేలగలుగు॥శ్రీశివా॥౬౭॥
అనుకొనియాయిద్దరతి వేడుకలుమీర।
వెనుకలవేషమున వేగిరాగిరిక॥శ్రీశివా॥౬౮॥
హరుడపుడుతనచిహ్నమగుపడనీకుండ।
కరములందునుపూలగాజులనుదొడిగి॥శ్రీశి॥౬౯॥
గిలుకుమట్టెలువేళ్ళ చెలువందధరియించి।
కుచ్చులబావిలీల్ గుమ్మటీల్ మరియు॥శ్రీశివా॥౭౦॥
పచ్చలబొగడలు బవిరలుమొదలగు।
కర్ణభూషణములు కర్ణములమెరయ॥శ్రీ॥౭౧॥
ముక్కునబులుకెంపు ముంగరభాసిల్ల।
పెక్కురతనపుపూసపేర్లుచెన్నొంద॥శ్రీశివా॥౭౨॥
శిరమునవరత్న. శృంగారమైనట్టి।
బుట్టనొక్కటియానిపొలుపుమీరగను॥శ్రీశివా॥౭౩॥
పూర్వమువిష్ణుండు భువనమోహినియైన।
కరణినిదావచ్చి గరకంఠుడటకు॥శ్రీశివా॥౭౪॥
అతనివెంటనే యరుదెంచె భృంగియును।

తోటిమెరుకలసాని సాటివై మెలసి॥శ్రీశివా॥౨౫॥
బత్తితో మ్రొక్కుచు పరమేశు వెంటను।
తాటిబుట్టనుతన తలమీదబెట్టి॥శ్రీశివా॥౨౬॥
గాజుపూసలపేర్లు కంఠమునధరియించ।
ముక్కెరబొట్టదిముక్కునను వెలుగ॥శ్రీశివా॥౨౭॥
ఇత్తడికమ్మల నిరువొందచెవులందు।
హత్తించిసవరిని అపుడుతిట్టుచును॥శ్రీశివా॥౨౮॥
కొత్తయల్లిక గిల్కగుత్తులు మ్రోయింది।
వాయించికొంచునువచ్చెశివువెంట॥శ్రీశివా॥౨౯॥
శివునియోగంబున శీఘ్రంబుగాభృంగి।
పార్వతియింటికి బరగంగజనియె॥శ్రీశివా॥౩౦॥
చనియెరికెతవలె బనిబూనిబిచ్చంబు।
నడుగుచునెరుకనుకడుజెప్పదొడగె॥శ్రీశివా॥౩౧॥
అవ్వవోయవ్వమా యవ్వమారాజవె।
యవ్వ భాగ్యముగలిగియ లరారునీవు॥శ్రీశివా॥౩౨॥
పాడిపంటలుగలిగి ప్రబలుదువెయవ్వ।
సిరిగలతల్లివై సిద్ధముగనీవు॥శ్రీశివా॥౩౩॥
కొడుకులకోటవై కూడియుండెదవవ్వ।
చుట్టాలసురభివై సొంపొందునీవు॥శ్రీశివా॥౩౪॥
బంధుగులుగలిగిన భాగ్యవతివేయవ్వ।

అమ్మవారమ్మవా రమ్మవారనుచు। శ్రీశివా॥౮౫॥
జగదమ్మజగదమ్మ జగదమ్మ వినుమమ్మ।
బంగారుకాలికి బాగ। మొక్కెద నే॥ శ్రీశివా॥౮౬॥
అమ్మదోసెడుముష్టి నందిచ్చి వేగమే ।
బుర్రిగాడికిముద్ద బువ్వబెట్టమ్మ॥ శ్రీశివా॥౮౭॥
పోడిగాడిప్పుడు చూడునీపైబత్తి।
గలిగిజంజమ్మని కడువేగవచ్చె॥ శ్రీశివా॥౮౮॥
నీరొట్టె యిప్పుడు వేతబడనున్నది।
నీకోర్కె గట్టెక్కు నిజముగానమ్మ॥ శ్రీశివా॥౮౯॥
అనవిని పార్వతి యామెరుకులదాని।
నెరుకయడిగెదనని నెనరుగాబలికె॥ శ్రీశివా॥౯౦॥
అవునె యెరుకులదాన యడిగనట్లిచ్చెద।
తార్కాణముగజెప్పు తరుణినాకోర్కె॥ శ్రీ॥౯౧॥
అనిగౌరి యడిగిన నామాయయెరికెత।
చెప్పెనుఒకమాట నొప్పుగా నపుడు॥ శ్రీశివా॥౯౨॥
ఎరుకజెప్పుటకిప్పు డేమితోచదు నాకు।
నాయవస్థనువినుము నాతిరో నీవు॥ శ్రీశివా॥౯౩॥
నాపతినన్నును నాగవతిగణములను।
విడచిదానోకకొండ వెలదుకనుకూడ॥ శ్రీశి॥౯౪॥
వలపితిరుగుచునుండె వానివాడను నేను।

వచ్చియుంటివినుమ్మా వనితవినుమమ్మ। శ్రీ॥౯౫॥
మూచాయలేగాని మూటిగాజెప్పంగ।
జాలనునిజమును వీలుగాజెప్ప॥శ్రీశివా॥౯౬॥
మామెరుకలసాని మానుగానిద్దరి।
నున్నదినిజమును నొప్పుగాజెప్పు॥శ్రీశివా॥౯౭॥
అనవిని చెలిపిల్చి యతివేడ్కలోబంచె।
యెరుకలసానికై యతివేగమునను॥శ్రీశివా॥౯౮॥
ఎరికెనదరిజేరి యెలనాగపలికెను।
నిమువోడితెమ్మనె నిమిషమెడలేక॥శ్రీశివా॥౯౯॥
రావమ్మయోయమ్మ రాజసమేలనె।
యతివేగమునను మాయమ్మసన్నిధికి॥శ్రీశివా॥౧౦౦॥
అనిన నెరుకులసాని యతిముదమొదవంగ।
నెరుకో యెరుకో యనుచు నింపుతోవచ్చె।శ్రీ॥౧౦౧॥
వచ్చినయెరికతను వరముగాపార్వతి।
జూచియద్భుతమొందె సుదతియందముకు॥శ్రీ॥౧౦౨॥
రత్నపీఠమునందు రమణినిగూర్చుండ।
నియమించకపటపు నెలతయుట్టిసియె॥శ్రీశి॥౧౦౩॥
ఎరుకవారలు గలరెందరైనను మాకు।
సరివత్తురే కలపజానవరో వినవే॥శ్రీశివా॥౧౦౪॥
మమ్మునలోకసామాన్యముగదలచకుము।

కొన్నితారార్కాణములు కొమ్మనే చెపుదు॥ శ్రీ॥ ౧౦౫॥
పద్మజు రాణికి పరిణయంబౌటమా।
మెరుక నేగాదటే యెంచిచూడగను॥ శ్రీ॥ శి॥ ౧౦౬॥
పాకశాసను రాణి పరిణయంబౌటయు।
మామెరుక నెఱాదె మహనీయముగను॥ శ్రీ॥ శి॥ ౧౦౭॥
గరిమగామూడు లోకముల శుభంబులు।
మాయెరుక నేసుమ్ము మానుగానమ్మ॥ శ్రీ॥ శి॥ ౧౦౮॥
తరుణినీమదికోర్కె తార్కాణముగ జెప్పి।
తగుకోర్కె లందుదునుతప్పకను నేను॥ శ్రీ॥ శి॥ ౧౦౯॥
ఆమాటలన్నియు నతివేడ్కతో విని।
యాగౌరితనమది నలరంగదలచి॥ శ్రీ॥ శి॥ వా॥ ౧౧౦॥
బంగారు చేటలో పలముత్యములబోసి।
మున్నూరుతనహస్తమునబట్టి వేగ॥ శ్రీ॥ శి॥ వా॥ ౧౧౧॥
ఫాలభాగమునందు పరమభక్తిగనుంచి॥
మ్రొక్కియిట్లనుచును ముదితమదిదలచె॥ శ్రీ॥ ౧౧౨॥
ముక్కంటి సామికిజక్కగా దయవచ్చి।
నన్నేలుదు పెండ్లాడు దమ్మమీరగను॥ శ్రీ॥ శి॥ ౧౧౩॥
అనితలచిముత్యముల నా చేటలో బోసి।
నళినాక్షి యందిచ్చె బలువొందగాను॥ శ్రీ॥ ౧౧౪॥
అవుడు లేనగవొప్ప నాదొరకలసాని।

అన్యదైవములనెట్లను చుదలపోసి॥శ్రీశివా॥౧౧౫॥
సామిసీయప్పటి సక్కరధనుడవో।
దామోదరయ్యయో దైవములరాయ॥శ్రీశి॥౧౧౬॥
వేదాలుబమ్మకు యిచ్చినదొతండ్రి।
మాధవరాయుడా మనునేలువేల్ప॥శ్రీశి॥౧౧౭॥
ఋూదారరూపంబుబొందినయోసామి।
ఆదినారాయణయఖిలాండనాథ॥శ్రీశివా॥౧౧౮॥
పిమ్మాదిరప్పన్న సింహాద్రినాయకుడ।
నల్లనగుదేవర నాముమ్ము లయ్య॥శ్రీశివా॥౧౧౯॥
తెల్లనితిరుమణి దిదినయోసామి।
నీకుమొక్కెదనిపుడునీలాద్రినాథ॥శ్రీశివా॥౧౨౦॥
జోకతోనాకన్ని చెప్పదదెలుపుమీ।
బెజవాడలోనున్న పేరయినదుర్గ॥శ్రీశి॥౧౨౧॥
ఉజనీమహంకాళి యోయాదిసీసతి।
నికిలేశినారాయణి భద్రకాళి॥శ్రీశివా॥౧౨౨॥
వికటింపకుమినీవు విశదపరచెద నేను।
మాయాపురీశ్వరుని మరిగినదేవి॥శ్రీశివా॥౧౨౩॥
ఓయాదిలచ్చిమి యోలోకములమాత।
మోడకనాకిపుడు దోడుగావలయు॥శ్రీశి॥౧౨౪॥
ఓబమ్మయిల్లాల యోసరసపతిదేవి।

రామా భారతదేవి రామా పలుకు మాత॥ శ్రీ శివా॥ ౧౨౫॥
పరగంగ నాజిహ్మ బాయకనుండుమీ।
యెరుకజెప్పెడి వేళ మరువకను నీవు॥ శ్రీ శి॥ ౧౨౬
ఇగనాలుదొలగించు నిగనేశమూరితి।
సగినాలు లెస్సగా పొగగా జేయు॥ శ్రీ శివా॥ ౧౨౭॥
ఉల్లంబులోసల్పు డెల్లజేజేలార।
కొల్లా పురీ దెవికోరెద నె నిన్ను॥ శ్రీ శివా॥ ౧౨౮॥
ఆశించి యీదుండి యాత్మలొండలచిన।
తలపులీడేర్చుము తారార్ణమునగను॥ శ్రీ శి॥ ౧౨౯॥
ఈశాంతమనను నాయెడవచ్చునట్లుగా।
వాకియ్యరేనాడు వదనమునసిలిది॥ శ్రీ శివా॥ ౧౩౦॥
అనిమొంటి వాల్గంటినంటిని ననియొంది।
కేలుకేల నమర్చి మేలెరుక చెప్పె॥ శ్రీ శివా॥ ౧౩౧॥
ఓయమ్మ యోదెవి యోభాగ్యశాలి వే।
భాగ్యములుగల చెయ్యి పత్తచెయ్యి॥ శ్రీ శి॥ ౧౩౨॥
సంతానములుగల చల్లనినీచెయ్యి।
కొడుకులకోట్లవై కొమరందవమ్మ॥ శ్రీ శివా॥ ౧౩౩॥
ఒకరు తలపుజేసి యొకకోరికనుకోరి।
దొడ్డమేలడిగితివి చెడ్డలేదమ్మ॥ శ్రీ శివా॥ ౧౩౪॥
ఆవికా యొపండొయని యడుగుచునునాన్నవు।

కల్లమోసజమొయని కడుభ్రమసినావు॥శ్రీ॥౧౩౫॥
అవునో కాదోయని యాత్మలోఁదలచితిఁ।
చేకూడవో లేక చేకూడుననుచు॥శ్రీశివా॥౧౩౬॥
తడబడుచున్నావు తరుణిరో వినవమ్మ।
కాయగాదది పండు కాంతవినవమ్మ॥శ్రీశివా॥౧౩౭॥
కల్లగాదది నిజముకలికిరో వినవమ్మ।
శీఘ్రమే చేకూడుసిద్ధమిది నమ్ము॥శ్రీశివా॥౧౩౮॥
ఏకోపుకార్యమన నీకోపుకార్యమిది।
తలపుతాఙ్ఞాణముగతప్పకనుజెపుదు॥శ్రీశి॥౧౩౯॥
స్త్రీపురుషభేదములు సిద్ధముగజెప్పుదు।
మగవారిపైతలపుమగువరో వినవె॥శ్రీశివా॥౧౪౦॥
ఎదలోఁదలంచితివి యెవ్వారినో కానని।
యొకటిరెండోమూడో యొప్పగాననిన॥శ్రీశి॥౧౪౧॥
పండ్లతరణిగాదు యెంనాగవినమ్మ।
కొద్దిలోఁ మహూపు కొం అతిలేకుండ॥శ్రీశి॥౧౪౨॥
చోడగాడినిజూడి చోద్యంబుగానీవు।
తకోరబెకోరలదనరింలికెదవే॥శ్రీశివా॥౧౪౩॥
అప్పుమనమమెచ్చి యకోరెల్లిచ్చెదవే।
యిప్పుడునీసాధుకిక్కడనెనావు॥శ్రీశివా॥౧౪౪॥
పాడగట్టియున్నాడు పాలకమగడాదునని।

నీకునుగనబడవు నాకుగనిపించు॥ శ్రీశివా॥౧౪౫॥
మేనువణంకెను మేయి చెమటబుట్టెను।
చాలపులకరింపు మేలు గాగలిగె॥ శ్రీశివా॥౧౪౬॥
నీపైనిదయవచ్చె నెమ్మితో బెండ్లాడు।
శీఘ్రముగనీకోర్కె సిద్ధమగునమ్మ॥ శ్రీశివా॥౧౪౭॥
నాబుట్టువోడని నమ్మించిపలికిన।
నానందముజెంది యతివిస్మయమున॥ శ్రీ॥౧౪౮॥
ఇదియేమి యూవింత యెరికత్తెలెందైన।
వచ్చిచెప్పరెకొన్నివరుసశకునములు॥ శ్రీశి॥౧౪౯॥
మొక్కి నేనడిగిన నిక్కముగనాకోరె।
నీమెరుకలసామి యింపుగను జెప్పె॥ శ్రీశివా॥౧౫౦॥
ఉచ్చుబోడిచితయట్టు లచ్చముగాజెప్పె।
నెరికతగాదిదియెంచి చూడగను॥ శ్రీశివా॥౧౫౧॥
నాపాలిశివకృప నాణెముగనీమూర్తి।
మైయవతరించెనని హర్షంబునొందె॥ శ్రీ॥౧౫౨॥
ఇచ్చెలిమెచ్చినే నేమిచ్చుదానను।
జగములనిచ్చినను జాలవీ చెలికి॥ శ్రీశివా॥౧౫౩॥
ఒసిమల్లెపూదండ దనప్రియు మెడనేయ।
నటులముక్తాహారమతివ మెడవైచె॥ శ్రీశివా॥౧౫౪॥
మరియునునవరత్న మయభూషణంబులు।

విలువైనచీరెలువిడెమొసంగుచును॥ శ్రీశివా॥ ౧౫౫॥
తగురీతినీజా'ల తెగదయనుంచుమనః।
వినయోక్తులాడిన వెలదికిట్లనియె॥ శ్రీశివా॥ ౧౫౬॥
ఇపుడేమినీతల పీడేరినప్పుడు।
నీభాగ్యమంతయును నిజముగా వాది॥ శ్రీశి॥ ౧౫౭॥
అనగనాదినిజమన్ని యాపార్వతీదేః।
వినయమున నెరికితను పేడ్కెల్పెఃంత॥ శ్రీశి॥ ౧౫౮॥
పగతిపశుపతి వేగమేపతియగు౯।
ననుచునాత్మనుదలచియతివచింతించె॥ శ్రీశి॥ ౧౫౯॥
తపముసేయకకాని దగసిద్ధిగాదని।
తల్లిదండ్రులయాజ్ఞదగబొందియపుడు॥ శ్రీ॥ ౧౬౦॥
జడలువల్కలములు సరవితోధరియించి।
గౌరీశిఖరమునకు గౌరిచాజనియె॥ శ్రీశివా॥ ౧౬౧॥
అచ్చటనివసించి యతిఘోరతపమును।
జేయనారంభించె సిద్ధముగనంత॥ శ్రీశివా॥ ౧౬౨॥
నిబిడగర్జనలతో నీరదంబులుగూడి।
తళతళమెరసి జలధారలన్గురియ॥ శ్రీశివా॥ ౧౬౩॥
బట్టబయలునవిల్చి బలునిష్ఠనుండగా।
శిరసుపైజలధార లెరవొందగురిసె॥ శ్రీశి॥ ౧౬౪॥
ఇట్లువర్షాకాల మింపుతోవెళ్లించ।

హిమసాంద్రముగవచ్చె హేమంతఋతువు॥ శ్రీశివా॥
ఇట్టిదుస్సహమైన హేమంతఋతువందు।
జలమధ్యమందుండి సతితపము జేసె॥ శ్రీశి॥ ౧౬౬॥
ఘీష్మంబుగావచ్చె గ్రీష్మఋతువంతటను।
వెలదియావేడిమికి వెరపేమిలేక॥ శ్రీశివా॥ ౧౬౭॥
పంచాగ్నిమధ్యమున పరమనిష్ఠనునిల్చి।
తపముజేయుచునుండె తరుణియచ్చోట॥ శ్రీ॥ ౧౬౮
ఆఘోరతపముచే నవసివణంకెను।
సర్వభూతములును చాలభయమొందె॥ శ్రీశి॥ ౧౬౯
అంతటశంకరుండతి మోదమొప్పంగ॥
వటువేషమునవచ్చె వనితసన్నిధికి॥ శ్రీశివా॥ ౧౭౦
తనఫాలభాగమున దగనూర్ధ్వపుండ్రము।
పాలాశదండంబు బరగహస్తమున॥ శ్రీశివా॥ ౧౭౧॥
లలితమధ్యంబున నలరమౌంజినిజుట్టి।
పాలుపొందుపావలను పొందుగామట్టి॥ శ్రీ॥ ౧౭౨॥
పచ్చకౌపీనంబు బాగుగాధరియించి॥
దరివచ్చిభృంగిని దగుశిష్యుజేసి॥ శ్రీశివా॥ ౧౭౩॥
అతనిశిరమందు నజినపుస్తకములు।
చెలువొందగానుంచి చెలిమిమీరగను॥ శ్రీ॥ ౧౭౪॥
పదియునారేడుల ప్రాయపుబాలుడై।

బాలసూర్యునివలెబలు తేజ మొప్ప॥ శ్రీశివా॥ ౧౭౫

వామనమూర్తివలె వచ్చిపావనమైన ।
గౌరీతపోవనముగనె నెసంతసమున॥ శ్రీశివా॥ ౧౭౬॥

ఫలపుష్పచయముచే విలసిల్లువనమందు।
తనజపాంతమునందు దగజెలులకూడి॥ శ్రీ ౧౭౭॥

మితఫలాహారంబు మేలిమిగాజేసి ।
వేదికపైనియూ వెలదికూర్చుండె॥ శ్రీశివా॥ ౧౭౮॥

ఆపార్వతినిజూచి యతిమోహామగ్నుడై ।
వటువేషధారియగు వామదేవుండు॥ శ్రీ॥ ౧౭౯॥

సర్వజ్ఞుడయ్యును సామాన్యతనుబూని।
యతివసౌందర్యమునకతిలోలుడగుచు॥ శ్రీ॥ ౧౮౦॥

ఈబాలనేలీలనెననెసెదనోయనుచు।
నింతిసమీపమునకేలమితోవచ్చె॥ శ్రీశివా॥ ౧౮౧॥

అప్పుడుచెలికత్తెలతనిగనిగౌరితో ।
పియమలరబల్కిరినయమొప్పగాను॥ శ్రీశి॥ ౧౮౨॥

నీపాలిశివుడువలె నేపారగావచ్చె ।
దగుబ్రహ్మచారియైతనరినమూర్తి॥ శ్రీశివా॥ ౧౮౩॥

ఇట్టివారలపూజ సింపాందజేసిన ।
నిఖిలశుభంబులునీకబ్బుగల్గు॥ శ్రీశివా॥ ౧౮౪॥

అటుగాననీతని కతిభక్తిచేమ్రొక్కి ।

దీవసలొందుము తేజరిల్లగను। శ్రీశివా॥ ౧౭౫॥
అనగౌరియాతని కర్ఘ్యపాద్యములిచ్చి।
నతి జేసియు చిత్రాసనముసమర్పించె॥ శ్రీశి॥ ౧౭౬॥
అకపటవటుడు దా వాశీర్వదించెను।
శీఘ్రమేవవివాహసిద్ధిరస్తనుచు॥ శ్రీశివా॥ ౧౭౭॥
అసమయునిట్లనె నాసనాసీనుడై।
యతివనుజూచి యత్యానందముగను॥ శ్రీశి ౧౭౮॥
ఎవ్వరిదానవే యింతినీ పేరేమి।
యేలతపమొనరించె దీవనమునందు॥ శ్రీశి॥ ౧౭౯॥
హిమగిరితనయవో యౌవనలక్ష్మివో।
నిజముగా దెలుపుము నీ కేజనేత్రా॥ శ్రీశివా॥ ౧౮౦॥
తెలిపిననీకోర్కె ఫలితముగాజేయ।
జాలుదుజవ్వని జాలమికనేల॥ శ్రీశివా॥ ౧౮౧॥
అనినన పార్వతి యతిలజ్జనొందుచు।
తన చెలికలవాణి గనిననడియదియె॥ శ్రీశివా॥ ౧౮౨॥
వినుమయ్యయీకన్య తనయహిమవంతునకు।
పార్వతియనుపేర బరగుచునుండు॥ శ్రీశి॥ ౧౮౩॥
శివునిబెండ్లాడుటకు చిత్తముదృఢపర్చి।
తపముజేయుంబూనె తథ్యముగనిచట॥ శ్రీశి॥ ౧౮౪॥
అనినబ్రహ్మచారివేషపకుర్ర నను నవ్వి।

అనురాగమునసిట్టులనియె నుమతోడ॥ శ్రీశి॥ ౯౫॥
ఎక్క సత్యముగాగ నీచెలిపలికెనో।
అక్కటహరునిబెండ్లాడంగవగునె॥ శ్రీశివా॥ ౯౬॥
పరీతిదోచెనీకిబుద్ధిజెప్పవే।
పడతిరోసబుద్ధిబంగారుగాను॥ శ్రీశివా॥ ౯౭॥
కపటబుద్ధిసిన్ను కడుమోసపుచ్చిరి।
యెవ్వరోగానినే నేమిచెప్పుదును॥ శ్రీశివా॥ ౯౮॥
అయినతనిచర్యలరసి చెప్పెదగొన్న।
కులగోత్రములు లేవుగుణహీనుడతడు॥ శ్రీశి॥ ౯౯॥
అట్టివానిని బెండ్లియాడుట కన్నను।
పుస్తెగట్టించుకో పాలతిస్థాణువున శ్రీశి॥ ౧౦౦॥
నగుబొట్లపనియగు నమ్మునామాట।
తగమనీవతనివి దగబెండ్లియాడ॥ శ్రీశివా॥ ౧౦౧॥
నేనును నిక్కము నిర్జితేంద్రియుడను।
అయిననునిను బెండ్లియాడనెప్పెదను॥ శ్రీశి॥ ౧౦౨॥
స్వాధ్యాయమంతయు సాంగముగానేను।
నధ్యయనముజేసి యలరియుంటినిగ॥ శ్రీశి॥ ౧౦౩॥
బ్రహ్మచారినిలోక పావనుండనుబహు।
ధనముగలవాడనుతరళాయతాక్షి॥ శ్రీశివా॥ ౧౦౪॥
అష్టవిభూతుల ననుభవింపుచునీవు।

కొండనెక్కెద విపుడెకొరత లేకుండ॥ శ్రీశి॥ ౨౦౫॥
ఇపుడేమి జెప్పెద నీమేను నీవిడయే।
తపము చాలించు నాతరుణివగుటకును॥ శ్రీశి॥ ౨౦౬॥
అనవిని పార్వతి యతికోపయుక్తయై।
చెలులతో నిట్లని తెలియగా బలికె॥ శ్రీశివా॥ ౨౦౭॥
బ్రహ్మచారియటంచు భావించి భక్తిచే।
పూజ జేసితి వీని బుద్ధి తెలియకను॥ శ్రీశివా॥ ౨౦౮॥
శివు శంభు నీశ్వరు చిన్మయానందుని।
నింద జేసెనహాహ నీతిదప్పుచును॥ శ్రీశివా॥ ౨౦౯॥
పరగంగజాదిన పరమకామాంధుండు।
వటుడుగాడీతడు మటుమాయదారి॥ శ్రీశి॥ ౨౧౦॥
బోటులెల్ల నుతను బుద్ధులు చెప్పుచు।
వీనినిచటినుండి వెడలింపవలయు॥ శ్రీశివా॥ ౨౧౧॥
అని చెప్పి పార్వతి యతిలజ్జితాత్మయై।
యున్నంత చెలులెల్ల నొక్కుమ్మడిగను॥ శ్రీ॥ ౨౧౨॥
కోకలు బిగగట్టి కోపంబులలరంగ।
మాయావటుని గదిసి మానినులు వేగ॥ శ్రీశి॥ ౨౧౩॥
వచ్చినవారిగని వటుశివ్యుడాభృంగి।
పలికెను దానవుకుభయము రెట్టిల్ల॥ శ్రీశివా॥ ౨౧౪॥
ఏమి చేయుదురు నీ కెవ్వరుదిక్కిక।

కామినీభూతములు కడుపుట్టదోడగ॥ శ్రీశి॥ ౨౧౫॥
ఎందేనిబోవక నిటకేలవస్తిరి।
యికనుమిమ్మునువిడువ రీమానవతులు॥ శ్రీ॥ ౨౧౬॥
వచ్చియుబోందగా వసియించియుండక।
పోకిళ్లుపోనేల పూనిమీరిచట॥ శ్రీశివా॥ ౨౧౭॥
సమయసగానాకు చదువెవరు చెప్పేరు।
నేనెక్కడికిబోను నెనరుతోనిపుడు॥ శ్రీ॥ ౨౧౮॥
అటు వగచుచునుండు నాభృంగిగనుగొని।
మునుపేబట్టదగు మొరబెట్టకుండ॥ శ్రీశి॥ ౨౧౯॥
అనియతివలుడాయ నతిభీతినొంచుచు।
ఆయవారిపుస్తకము లంటవద్దనుచు॥ శ్రీశి॥ ౨౨౦॥
పాదభగ్నంబైన పగిదిగుంటుచునడుచు।
భృంగినెగనినగియంగనలనిరి॥ శ్రీశివా॥ ౨౨౧॥
మీయయ్యవారికి మేముప్పెట్టెడిపాళ్లు।
చూడుమటంచును చేడియలుమరియు॥ శ్రీశి॥ ౨౨౨॥
వడికొనివచ్చిన వడిమొల్లబెట్టుచు।
ననువమలుడీమీరు నయముగానిపుడు॥ శ్రీశి॥ ౨౨౩॥
అయ్యవారలవద్ద నధ్యయనమును జేయ।
నయిదచ్చరములైననరయరావాయె॥ శ్రీ॥ ౨౨౪॥
అయ్యవారిని గూటుటక్కర లేదిక।

ఏమైననా కేమియీయయ్యకిచాట॥శ్రీశివా॥౨౨౫॥
అనిబ్రతిమాలిన యతఁడింతులువిడచి।
బ్రహ్మచారినిగవిసిపనిబూనిరపుడు॥శ్రీశివా॥౨౨౬॥
బాపడుకటిమాత్ర మేపాటిగట్టెడిని।
డెబ్బెనమొలత్రాడుదెంచెనొకవనిత॥శ్రీశి॥౨౨౭॥
మాచెలినినునంటె మైలనొందితివని।
తలమీదఘటముచేదగనీరునుంచె॥శ్రీశివా॥౨౨౮॥
వినదగునల్లుఁగా నెవ్వింతుపెండ్లికని।
సిగబట్టిమన్నంద జేసెనొకచెలియ॥శ్రీ॥౨౨౯॥
పులిభయంబిచ్చుటను పొమ్మనిబెదరించి।
పులితోలుపైవేసె పొలతియొకర్తె॥శ్రీశి॥౨౩౦॥
ఈరీతిఁనవమాన మింతులుచేసిన।
సత్యంబులైయొప్పసర్వేశుడపుడు॥శ్రీశివా॥౨౩౧॥
గగనాంబరుండును గంగాధరుండును।
వ్యోమకేశుండయి యొనరిదామాటియు॥శ్రీ॥౨౩౨॥
వ్యాఘ్రచర్మంబును వసనముగాదాల్చి।
హరుడుప్రత్యక్షమైయుమరెనవ్వుచును॥శ్రీ॥౨౩౩॥
ఆరీతిశంకరుండటులగనిపించంగ।
నతిసంభ్రమంబుతోనకాంతలలరి॥శ్రీశి॥౨౩౪॥
అతివేగమునబల్కె రాగౌరితోనపుడు।

వామదేవుండయ్యె వటువేషధారి॥ శ్రీశివా॥ ౩౫॥
అనవిని పార్వతి యతిసంభ్రమముతోడ।
భక్తిచేలజ్జచే ప్రేమచేనలరె॥ శ్రీశివా॥ ౩౬॥
కలకలనవ్వుచు కలవాణిసఖికనియె।
తగుబుద్ధిజెప్పితివి పదపునకిపుడనిన॥ శ్రీశివా॥ ౩౭॥
నవమాలికనియెను నగికలవాణితో।
నాశివునకెగ్గేమియటవత్తాజేసె॥ శ్రీశివా॥ ౩౮॥
బ్రహ్మచర్యముమాన్పి యిరగనీశ్వరునకు।
వరగృహస్థునిజేయు కరమొప్పగాను॥ శ్రీ॥ ౩౯॥
అనవిని పార్వతితన చెలులకు మ్రొక్కె।
మేలమాడుటకిది వేళయేయనుచు॥ శ్రీశివా॥ ౪౦॥
ఆసమయంబున నచటికి శంభుండు।
వృషభవాహనమెక్కి వేడ్కతో వచ్చి॥ శ్రీ॥ ౪౧॥
రమణీమణినిజూచి రమణీయముగబల్కె।
ప్రేమాభిమానముల్ బెనగొనుచునొప్ప॥ శ్రీ॥ ౪౨॥
రావెముద్దులగుమ్మ రమణిరో సిగ్గేల।
నను నేలుమీవేగ నావెతలుదీర్చి॥ శ్రీశివా॥ ౪౩॥
తాళజాలనునేను తరుణిరో మ్రొక్కెదను।
వేగకౌగిలియిచ్చి వెలయననుబ్రోవు॥ శ్రీశి॥ ౪౪॥
అనిపెక్కుభంగులనభవుండు వేడిన।

లజ్జచే జెలినరపిలలితముగ బల్కె॥ శ్రీశివా॥ ౨౪౫॥
తల్లిదండ్రులచాటుదాననటంచును।
చెలియనామారుగా దెలుపంగరాదే శ్రీశి॥ ౨౪౬॥
నను బెండ్లియాడుటకు నగరాజు చెంతకు।
తగువారినంపుటది ధర్మమార్గంబు। శ్రీశివా॥ ౨౪౭॥
అనిగౌరిబల్కంగ నదివినిశంభుండు।
నంతహృష్టుండయ్యె నతివిరహమునను॥ శ్రీ॥ ౨౪౮॥
చింతచే కైలాస శిఖరికి నేతెంచి।
వింతవింతలుమదిని చింతింపుచుండె॥ శ్రీశి॥ ౨౪౯॥
అంతటపార్వతి యతివిరహితాత్మయై।
తనసకియలనుజూచి తగబట్టులనియె॥ శ్రీశి॥ ౨౫౦॥
తెరువేదో మధరునకు దయవచ్చియెన్నడు।
కోరికలనుదీర్చు కొరత లేకుండ॥ శ్రీశివా॥ ౨౫౧॥
అనుచువేసటనొందు నప్పార్వతినిజూచి।
కలవాణీనవమాలి కలుసంభ్రమమున॥ శ్రీశి॥ ౨౫౨॥
శిశిరోపచారముల సేదదేరిచివేగ।
జనిహిమవంతుని గని జెప్పిరంత॥ శ్రీశివా॥ ౨౫౩॥
అహిమవంతుండు నామేనకయువిని।
సంతసమొందిరి పరవితోనంత॥ శ్రీశివా॥ ౨౫౪॥
మరియునుదమపుత్రి మంగళోత్సవమును।

సమకూర్చునీశ్వరుడె సర్వరక్షకుడు॥శ్రీశి॥౨××॥
అనుచుసర్వేశ్వరుని నానందమునవారు।
ధ్యానించుచుండిరి మానసమునందు॥శ్రీశి॥౨×౬॥
శ్రీశివాశితికంఠ శ్రీపార్వతీశ్వరా॥
శ్రీశుభంబులనొసగి శీఘ్రమునబ్రోవు॥





శ్రీరామ-

శ్రీరస్తు.

శ్రీశుభం భవతు-

అవిఘ్నమస్తు-

శ్రీశివాయగురవేనమః-

# శ్రీగౌరీవివాహః

## తృతీయాశ్వాసప్రారమ్భః-



శ్రీశివా శితికంఠ శ్రీపార్వతీశ్వరా।
శ్రీశుభంబులనొసగి శీఘ్రమున బ్రోవు॥
ఈశ్వరప్రేరణ నింపుతో ఋషులెల్ల।
శివుజూడవచ్చిరి శీఘ్రంబుగను॥ శ్రీశివా॥ ౧॥
ఆసమయమునందు నగజనుదలచుచు।
విరహసంతాపమున వరశంకరుండు। శ్రీశివా॥ ౨॥
కైలాసగిరిచంద్ర కాంతశిలామయ।
వేదిపైభృంగితో వాసనువసియుంచె॥ శ్రీశివా॥ ౩॥
సప్తమహాఋషులు సరసకు వేతేర।
శంభునలో భృంగి సరసముగనని॥ శ్రీశివా॥ ౪॥
అవచ్చువారెవ్వరతివృద్ధదేహులు।

ఆరసి సెలవియ్యుడీ యతిశీఘ్రమునను ॥ శ్రీశివా ॥ ౫ ॥
అనశంకరుండనియె నావచ్చువారలు।
సప్తఋషివర్యులు చనుదెంచిరటకు ॥ శ్రీశివా ॥ ౬ ॥
అనుచునంతలోఋషు లతిమోదమునవచ్చి।
చెలగియథావిధిగ శివునిదర్శించి ॥ శ్రీశివా ॥ ౭ ॥
ఉచితపీఠములందు నొప్పుగాగూర్చున్న।
మౌనులకుశలంబు మానుగానడిగి ॥ శ్రీశివా ॥ ౮ ॥
ప్రాసంగికంబుగా పార్వతిని కొండాడ।
తనతలంపునుదెల్పి నగనిట్లులనియె ॥ శ్రీశివా ॥ ౯ ॥
ఈకార్యమునకును నికరముగామీరు।
ఘటకులైసంఘటన గావించవలయు ॥ శ్రీశివా ॥ ౧౦ ॥
ఘనులారమునులారకడువేగమీరు।
హిమవంతుసన్నిధి కేగంగవలయు ॥ శ్రీశివా ॥ ౧౧ ॥
ఫలపుష్పములతోడ బాగుగామీరలు
తగురీతినాతని దర్శింపవలయు ॥ శ్రీశివా ॥ ౧౨ ॥
మరివారిపెద్దలను మానితంబుగగూర్చి।
మాట్లాడవలయును మహనీయముగను ॥ శ్రీ ॥ ౧౩ ॥
కార్యార్థికిని నేమి గర్వముండమిగాన।
నీయకుంఠతితోడ నేగంగవలయు ॥ శ్రీశివా ॥ ౧౪ ॥
ఆర్యనడుగుటకయి యతివలమొద్దకు।

నమితసత్కారము లమరంగ జేసి॥ శ్రీశివా॥ ౨౫॥
మా భాగ్యవశమున మాగృహంబునకును।
మీరు వేంచేసితిరి మేముధన్యులము॥ శ్రీశివా॥ ౨౬॥
మిరాకచే మాకు మేలైనశుభములు।
గలుగుట కేమైనగలదె సంశయము॥ శ్రీశివా॥ ౨౭॥
అన మునీశ్వరులు రాననగాధీశుతో।
మీరన్నమాటల మిథ్యయగునిలను॥ శ్రీశివా॥ ౨౮॥
మేమును శుభకార్య మేనిశ్చయించుకొని।
వచ్చితిమిప్పుడు వరవాహనమునను॥ శ్రీశివా॥ ౨౯॥
కార్యసంఘటనము గావించవలెమీరు।
మామాటమన్నించి మహనీయముగను॥ శ్రీశి॥ ౩౦॥
శ్రీసదాశివునకు శ్రీసర్వమంగళను।
శ్రీకరంబుగనిచ్చి శ్రీనిధివిగమ్ము॥ శ్రీశివా॥ ౩౧॥
నీపుత్రికకుదగు నెమ్మిమీరగశివుడె।
శివునకునీపుత్రి చెలువొందదగును॥ శ్రీశివా॥ ౩౨॥
భాగ్యభోగ్యములచే బరిబరిదంపతులయి।
మొదదొగప్రేమచే నెలమిమందెదరు॥ శ్రీశి॥ ౩౩॥
సంశయంబుందక సర్వజ్ఞమూర్తికి।
కన్యాకమర్పణ గావించవలయు॥ శ్రీశివా॥ ౩౪॥
అనిన సంతసమొంది యానగరాజు నె।

మీయాజ్ఞ మన్నింతు మేలిమిగనిపుడు॥ శ్రీశివా॥ ౩౫॥
ఇందుశేఖరునకు నింపుతో సచ్చెద।
నాముద్దుపట్టిని నయముమీరగను॥ శ్రీశివా॥ ౩౬॥
తగినట్టుస్థల మెంచి తగిలియవలెనని।
పెద్దలవాడిక పేమి చేగలదు॥ శ్రీశివా॥ ౩౭॥
ఇంతకన్నను శుభ మేమియు లేదని।
సంతసముగబల్కె నెంతయేననుచు॥ శ్రీశివా॥ ౩౮॥
అంతఃపురంబునకాయరుంధతి చని।
మేనకచేత సమ్మానమును బడసి॥ శ్రీశివా॥ ౩౯॥
అపుడు మేనకతోడ నతికౌతుకంబొప్ప।
అహాహా నీభాగ్యమే మని చెప్పవచ్చు॥ శ్రీశివా॥ ౪౦॥
హరుడు నీయల్లుడ నయ్యెపననుచును।
కోరుచనిపుడుండె కొమ్మా వినుమమ్మ॥ శ్రీశివా॥ ౪౧॥
ఆయింక ధరునకు నీయిందుముఖికి।
దగవివాహము చేయదగునెంచి చూడ॥ శ్రీశివా॥ ౪౨॥
ఈసంపదలపెండ్లి యెల్లలోకములకు।
నానందకరమగుచు నలరిశోభిల్లు॥ శ్రీశివా॥ ౪౩॥
అననరుంధతితోడ ననియెన మేనక।
యతివినయంబున నతిహర్షమునను॥ శ్రీశి॥ ౪౪॥
సర్వసుఖంబులు సర్వసంపదలును।

మీదీవనలగాదె మేలుగా గలుగు ॥ శ్రీశివా ॥ ౪౫ ॥
పరమపతివ్రతావరశిఖామణులైన ।
మితలం పెన్నడు మిథ్యగాదిరయ ॥ శ్రీశివా ॥ ౪౬ ॥
ఆసమయంబున నమ్మేనకాత్మజయు ।
నటవిలాసముమీర నటనకేతెంచి ॥ శ్రీశివా ॥ ౪౭ ॥
నతిసొనరించిన నతిమోదముప్పొంగ ।
నాయకుండతిసతికి నాశీర్వదించె ॥ శ్రీశివా ॥ ౪౮ ॥
అంకముపైసతి నంగారవంబున ।
సుందిమేలంబొప్పుమజూచి యనియె ॥ శ్రీశి ॥ ౪౯ ॥
నాముద్దుతల్లినిను నయముతోనడుగెద ।
నిప్పుడేనమ్మకము నింపుగాజెపుము ॥ శ్రీశివా ॥ ౫౦ ॥
నీనాథుతోగూడి నీవెందుసమయమున ।
నవుడువచ్చినదనన్నానరసిరానీయవో ॥ శ్రీశివా ॥ ౫౧ ॥
అనవిని సిలజ్జచే నాననంబును వంచి ।
మేతలుపక్షులకు మేపింతుననుచు ॥ శ్రీశివా ॥ ౫౨ ॥
అనిదిష్టనను జనునాబాలచేపట్టి ।
రావమ్మపిగేల రమణిగోనీవు ॥ శ్రీశివా ॥ ౫౩ ॥
కౌగిలినొకమారు కరమొప్పనాకిచ్చి ।
జనుమనరాకున్న జననితాజూచి ॥ శ్రీశివా ॥ ౫౪ ॥
కనుబామనదలించి తనయుతోనిట్లనె

పెద్దలాజ్ఞనునీవు పేర్మిజేసితివము॥ శ్రీశివా॥ ××॥
వచ్చికౌగిలియిచ్చి వరభక్తినుండుమీ।
యనునంతహిమవంతుడచటికేతెంచి॥ శ్రీశి॥ ××॥
మంతనంబునదన మానినితోజెప్పె।
కళ్యాణవార్తను గడుమోదమునను॥ శ్రీశివా॥ ××॥
వినిసంతసంబొందియనియె హిమవంతుతో।
పరమేశుతోమనము సరితూగుటెటుల॥ శ్రీశి॥ ××॥
కళ్యాణమేరీతి గావించువారము।
హరునికళ్యాణంబు హరియెచాజేయు॥ శ్రీశి॥ ××॥
భక్తవాత్సల్యమున పద్మాక్షుడరుదెంచి।
యీమహోత్సవమును నింపలరజేయు॥ శ్రీ॥ ౬౦॥
ఆనినిశ్చితాత్మతైయామునులతోనసిరి।
యిచ్చటనెయీపెండ్లి యింపుగానగును॥ శ్రీశి॥ ౬౧॥
పెండ్లికొడుకునుమీరు ప్రియముగావేగము।
తరలించుకొనిరండు తనువేడ్కమీర॥ శ్రీశి॥ ౬౨॥
అనివీడుకొల్పిన నామునులరుదెంచి।
హర్షమునశుభవార్తహరునితోజెప్ప॥ శ్రీశి॥ ౬౩॥
అతిముదమొందుచు నభవుండుకైలాస।
పట్టణాలంకృతిని బాగుగనుజేసి॥ శ్రీశివా॥ ౬४॥
బ్రహ్మాదులనుబిల్వ బంపించియనిమొను।

శ్రీహరి నేపగిది శిష్యులుగ బిల్వ॥ శ్రీశివా॥౬౫॥
సనకాదులకుగాని శక్యమేయటకేగ।
ననవారలే తెంచి హరువాజ్ఞజెందు॥ శ్రీశివా॥౬౬॥
స్వర్లోకమూదిగాసప్తలోకములను।
దాటి వైకుంఠమును డగ్గన తేక॥ శ్రీశివా॥౬౭॥
శ్రీహరిపదములు చిత్తములంబడి।
భక్తి చేబహుభంగి స్తుతులు చేయ॥ శ్రీశివా॥౬౮॥
శ్రీహరికృపచేత శ్రీకరంబైనట్టి।
వైకుంఠపురమును వారుగనిరంత॥ శ్రీశివా॥౬౯॥
భాగవతోత్తముల బాగుగా దర్శించి।
నతులొనరింపుచు నయముతోనపుడు॥ శ్రీశి॥౭౦॥
అతిశోభతోనున్న యారత్నసోపాన।
మార్గమునను జన మరియునచ్చటను॥ శ్రీశివా॥౭౧॥
అతివిశాలంబైన యత్యున్నతంబైన।
స్థలమెక్కగానదట లలితమైయున్న॥ శ్రీశివా॥౭౨॥
సింహాసనమునందు శ్రీవిష్ణుదేవుండు।
తనపత్నులనుగూడి తనరియుండగను॥ శ్రీశివా॥౭౩॥
వారలు శ్రీహరిని వరభక్తి దర్శించి।
సాష్టాంగదండములు సరగునను జేసి॥ శ్రీశి॥౭౪॥
కరములు జోడించి కడువేడ్కనుతి జేయ।

నత్యాదరంబున నచ్యుతుడుపలికె॥శ్రీశివా॥ ౭౫॥
మునులారమీవచ్చు పని మే మెరుంగుదుము।
పార్వతినిబెండ్లాడ పరమేశ్వరుండు॥శ్రీశి॥ ౭౬॥
తగనూహజేసిమిము దానంపెమముబిల్వ।
పార్వతిపెండ్లికి బరగవచ్చెదము॥శ్రీశివా॥ ౭౭॥
గౌరియందును మాకు కడుదయగావున।
హిమవంతుపక్షమున నేతెంతువినుడి॥శ్రీశివా॥ ౭౮॥
ఏపక్షమైనను నేమియొక్కటిగాదె।
మీరుబ్రహ్మాదులును మేలుగాజనుడీ॥శ్రీశివా॥ ౭౯॥
కైలాసగిరికేగి కడువేడ్కనుండుడని।
కమలపత్రాక్షుండు కరుణతో బల్కె॥శ్రీశి॥ ౮౦॥
అనవిని యామౌనులానందమగ్నులై।
శ్రీనాథునకు మ్రొక్కి సెలవుగైకొనుచు॥శ్రీశి॥ ౮౧॥
కైలాసనగరికి కడువేగమునజని।
శివునిసందర్శించి చెప్పిరంతయును॥శ్రీశివా॥ ౮౨॥
అంత శ్రీశంకరుండతితోషయుక్తుడై।
బ్రహ్మేంద్రమునులను బహుసత్కరించి॥శ్రీశి॥ ౮౩॥
సంతుష్టులంజేసి సరవితోనప్పుడు।
తనకునెచ్చెలియైనధనదునీక్షించి॥శ్రీశివా॥ ౮౪॥
తనయభీష్టసిద్ధిదగనాయెననుచును।

సలరుచుముచ్చటలాడుచునపుడు॥ శ్రీశివా॥౫౫॥
సూటిగానేకనుంచి సుముహూర్త దినమున।
భేరికాదిధ్వనులు భోరుమోయంగ॥ శ్రీశివా॥౫౬॥
వీణాదరవములు వేవేలు చెలగంగ।
రంభాదినాట్యములు రహిమించి వెలయ॥ శ్రీశి॥౫౭॥
వందిమాగధులు కైవారంబులును సేయ।
వరవసిష్ఠాదులు నరయదీవించ॥ శ్రీశివా॥౫౮॥
పరిణయోత్సవమునకు పరమేశ్వరుండును।
హిమనగంబునకేగు సమయంబునపుడు॥ శ్రీ॥౫౯॥
మెరుగులతలకన్న మేలైనపటుజటా।
పటలంబుబల్ జరీపాగలైయలరె॥ శ్రీశివా॥౬౦॥
చెలువైనకళలచే వెలకొన్న నెలమాన।
వజ్రపుసరిపేషు వగనుదగియుండె॥ శ్రీశివా॥౬౧॥
భాసిల్లు సిగతీరు వాసిగానున్నట్టి।
మిన్నేరు పూదండ మేలిమిగదనరె॥ శ్రీశివా॥౬౨॥
మిసిమిచేమెయినొప్పు భసితంబులే బూత।
రంగైనసన్నంపు టంగీలైమెరసె॥ శ్రీశివా॥౬౩॥
భూషణములైయున్న భోగిఫణిరబులు।
తాళీలైమెమించతళుకొత్తియుండె॥ శ్రీశివా॥౬౪॥
పులితోలుపైపన్నె బలుశాలువైయుండె।

వనల నేత్రము కుంక మలరుచుక్కవెయ్య॥ శ్రీశి॥ ౯౫॥
ఈరీతిగాను శివుడింపొంది పెండ్లికి।
వృషతురంగము నెక్కి వెడలె దానపుడు॥ శ్రీ॥ ౯౬॥
హరుశువచ్చెడి వార్త యాహిమవంతుండు।
విని మేరుమందరులకసమె నిట్లనుచు॥ శ్రీశివా॥ ౯౭
తామత సాక్షుండు దగరాకయున్నను।
పరిణయమోదంబుపరగ నెట్లవునో॥ శ్రీశివా॥ ౯౮
అని భావమున దల్చ నావిష్ణుదేవుడు।
కరుణారసం బొప్పనరుగు సమయమున॥ శ్రీ॥ ౯౯॥
శ్రీభూమినీళలు చెలువొంద వెంటను।
వచ్చెదమనుచును నుచ్చటించగను॥ శ్రీశివా॥ ౧౦౦॥
రావలదనుచును రాజీవ నేత్రుండు।
రమణులతో బల్కె రహిమించగాను॥ శ్రీశి॥ ౧౦౧॥
అసిననవ్వనితలు నామ్లానవదనలై।
యతిచింతనొందుచునపుడిట్లులనిరి॥ శ్రీశివా॥ ౧౦౨॥
మిమ్మెడబాయుచు మేమింటి వాండ్రెపుడు।
మమువిడనాడుటయు మాధవా తగునా॥ శ్రీ॥ ౧౦౩॥
అనవినియచ్యుతం డతిమోదమొందుచు।
నతివలనలరించి యలుకదీర్చపుడు॥ శ్రీశివా॥ ౧౦౪॥
శ్రీలక్ష్మివక్షమున చెలువుగా మెరయంగ।

నుభయపార్శ్వములందునురుతరంబుగను ॥౧౦౫॥
శ్రీభామినీళులు చెలిమిమీఱుచునుండ।
గరుడునిపైనెక్కి యరిగెహిమగిరికి॥ శ్రీశి॥౧౦౬॥
అప్పుడుహిమవంతు డతిభక్తియుక్తుడై।
సాష్టాంగముగమ్రొక్కి సవినయంబుగను॥ శ్రీ॥౧౦౭॥
కరములుజోడించి కడువేడ్క తోననియె।
నేనెంతవాడను నినుబూజసేయ॥ శ్రీశివా॥౧౦౮॥
అనుచుయథావిధి నచ్యుతుబూజించి।
నవరత్నసింహాసనము సమర్పించె ॥ శ్రీశివా॥౧౦౯॥
అందునధిష్ఠించి యాహరియుండంగ।
దానునుదనభార్య తగుపూజచేసి॥ శ్రీశివా॥౧౧౦॥
తనయచేమ్రొక్కించి వినయంబుగాననియె।
నీబిడ్డగాజూడు నిఖిలేశయనిన॥ శ్రీశివా॥౧౧౧॥
బాలనుదీవించి చాలసంతోషమున।
ననియెనప్పుడు హరియగరాజుతోడ॥ శ్రీశి॥౧౧౨॥
గంగవాపిని గౌరిగారాపుబిడ్డయె।
అయినసోదరివలె నమరంగజూతు॥ శ్రీశివా॥౧౧౩॥
అనియాజ్ఞనిచ్చుచు నానందమొందించి।
యందరినిజయచేత నలరిపిత్తించె॥ శ్రీశివా॥౧౧౪॥
అంతనప్పుడుజనులద్భుతమొందుచు।

నలినాక్షుసేవించినయమొప్పవశరి॥శ్రీశివా॥౧౧౫॥
హిమవంతుభాగ్యంబు నేమనవచ్చును।
బ్రహ్మాదులకుగాన బడసిహరివచ్చె॥శ్రీశి॥౧౧౬॥
ఈవారిరాకచే నింపుమీరగగౌరి।
కళ్యాణమిలలోనఘనతజెన్నొందు॥శ్రీశి॥౧౧౭॥
అనినుతియింపుచు నాజనులందరు।
కనులకింపుదీరకమలాక్షుగనిరి శ్రీశివా॥౧౧౮॥
శ్రీశునితనుకాంతి చెన్నొందిహిమగిరి।
యింద్రనీలచ్ఛాయ సొందరిమైదనరె॥శ్రీశి॥౧౧౯॥
అంతహిమవంతుండు నతిసంతసంబున।
పన్నీరుధారలను బరగజల్లించె॥శ్రీశివా॥౧౨౦॥
ముత్యాలముగ్గులను ముద్దుగాబెట్టించి।
మణిదీపజాలములుమరియునుంపించి॥శ్రీశి॥౧౨౧॥
కళ్యాణకేతువులు ఘనముగాస్థాపించి॥
వివిధచిత్రములను వెలయవ్రాయించి॥శ్రీశి॥౧౨౨॥
ఈకీర్తిసౌధముల నెలమిశృంగారించి।
మంగళోత్సవమును మదిగోరియుండె॥శ్రీ॥౧౨౩॥
అంతటశంకరుండతి వైభవముతోడ।
హిమగిరివరికినినే తెంచియచట॥శ్రీశివా॥౧౨౪॥
ఉద్యానవనమందమనుత్సాహముగనుండి।

భూసురులనిద్దరను బొంకుగా బంప॥ శ్రీశి॥ ౧౨౫॥
వారుసంతోషమున వచ్చియానగరాజు।
మాయుపవనమందు మేలుగానిపుడు॥ శ్రీశి॥ ౧౨౬॥
పెండ్లికొడుకును గూడి పెండ్లివారలువచ్చి।
దిగిమఱ్ఱిబనిచిరి తేజరిల్లగను। శ్రీశివా॥ ౧౨౭॥
అనిశుభవార్తనునాయిద్దరును జెప్ప।
నానగపతివారి నత్సత్కరించి॥ శ్రీశివా॥ ౧౨౮॥
మేరుమందరవింధ్య చారుమలయప్రముఖ।
బంధుమిత్రులతోడ బంధురంబగుచు॥ శ్రీశి॥ ౧౨౯॥
ముందుగావిష్ణుని మోదముగనుంచి।
జయవిజయాదులు జయజయయనంగ॥ శ్రీశి॥ ౧౩౦॥
వేత్రములంబూని వెలయుమైనాకుండు।
కోలాహలుండును గూడి వేడుకతో॥ శ్రీశి॥ ౧౩౧॥
ఉభయపార్శ్వంబులనుండిబరాబరల్।
సేయగానియమించె శ్రీకరంబుగను॥ శ్రీశివా॥ ౧౩౨
సుందరములైనట్టి యందలంబులతోను।
శ్రీభామినీశలును జెలువొప్పగాను॥ శ్రీశివా॥ ౧౩౩
మేనకమొదలైన మెలతలనందరను।
వచ్చునట్లొనరించె వరతోషమునను॥ శ్రీశి॥ ౧౩౪॥
రథగజాశ్వపదాతి రాజితచతురంగ।

బలములుసలుగడల భాసిల్లుచుండ॥శ్రీశివా॥౧౩౫॥
వారాంగనలనృత్యవైభవంబలరంగ।
భేరికాహళములు భోరుకొనిమోయ॥శ్రీశి॥౧౩౬॥
వీణాదివాద్యములు వీనులపింపగా।
గంధర్వగానముల్ ఘనముగామెరయ॥శ్రీశి॥౧౩౭॥
భూసురులదీవనల్ భూరిసంఖ్యగనొప్ప।
వందిమాగధులకైవారముల్ చెలగ॥శ్రీశివా॥౧౩౮॥
ఈరీతిహిమవంతుడీశుని పడిదికి।
వచ్చినత్యుత్సవ వైభవంబలర।శ్రీశివా॥౧౩౯॥
అంతసాయంసమయిమప్రటనునగనేత।
చంద్రదీపంబులును సాంద్రమైదనర॥శ్రీశి॥౧౪౦॥
కప్పురపుదివిటీలు కడుతేజమలరగ।
మహతాబువెలుగులుమరియులాయీలు॥శ్రీ॥౧౪౧
వెన్నెలకాంతివలె వెలకెక్కయుండంగ।
నక్షత్రతారలునునాగతారాలు।శ్రీశివా॥౧౪౨॥
కొమ్ములువేమారు కోట్లుదిచ్చుబుడు।
మహనీయమైనట్టిమరియగాధీలు॥శ్రీశివా॥౧౪౩॥
చాంపేయబాణముల్ చామంతిబాణముల్।
వెన్నముద్దలుమరియువింతబాణములు॥శ్రీశి॥౧౪౪
అంతరిక్షంబున నధికప్రకాశమున।

నలగురు మెలుగొంకు నాసమయమందు॥ శ్రీశి॥ ౧౪౫॥
రంభాదినాట్యముల్ రమణీయమై వెలయ।
నుభయపక్షమువారు నొప్పుగానపుడు॥ శ్రీశి॥ ౧౪౬॥
అభివందనాళింగ నాదిసత్కారములు।
ననోన్యమొనరించి యతిమోదములర॥ శ్రీశి॥ ౧౪౭॥
పన్నీరు మొదలైనపరిమళద్రవ్యముల్।
జల్లులాడు చుమనసులుల్లాసముగను॥ శ్రీశి॥ ౧౪౮॥
కప్పురపువిడియముల్ కస్తూరిదామముల్।
చందనపత్రపు సమితిజెన్నొంద॥ శ్రీశివా॥ ౧౪౯॥
దివ్యాంబరంబులు దేజరిల్లగనంత।
సర్వవైభవములు సరపజెన్నొంద॥ శ్రీశివా॥ ౧౫౦॥
పెండ్లికొడుకును ముంపే క్షించుగొని।
శ్రీవిష్ణునాజ్ఞచే జెలువుమీరగను॥ శ్రీశివా॥ ౧౫౧॥
విడిదిలోపలనుంచి కడుమోదమొప్పగ।
వెడలెనత్యుత్సవ విభవములరంగ॥ శ్రీశివా॥ ౧౫౨॥
అంతట మాధవుండల జయంతవసంత।
నలకూబరాదులను నాణెముగమరియు॥ శ్రీశి॥ ౧౫౩॥
ఇంద్రచంద్రాదుల నింపొందుమైనాక।
కోలాహలాదులను కొమరొప్పగాను॥ శ్రీశి॥ ౧౫౪॥
అంతగంధర్వుల నంతరాంతరముల।

సమరియుండగజేసియశుభంబులర। శ్రీశివా।౧౫౫॥
స్వర్గవేశ్యలనృత్య సౌరభ్యములజూడ।
నియమనంబొనరించినయట్లొప్పగాను। శ్రీశి॥౧౫౬
అఖిలజనావళి యానందభరితులై।
యుత్కృష్టతమునొందిరాయుత్సవమున। శ్రీ॥౧౫౭॥
పరమేష్ఠి హేమాద్రి వరవసిష్ఠమునీంద్ర।
సనకసనందన గస్త్యాదిముఖ్య॥శ్రీశివా॥౧౫౮॥
ఋషులతోనల్లనవృషభధ్వజునితోడ।
నగరాజపురమందు దగబ్రవేశించె॥శ్రీశివా॥౧౫౯॥
పురసుందరీజనులు పొల్పొందమాకిక।
కుసుమాక్షతములనుకొమరొప్పజల్లి॥శ్రీశివా॥౧౬౦
మంగళహారతుల మానినులుబట్టంగ।
పెండ్లికుమారునిప్రియముతోనపుడు॥శ్రీశి॥౧౬౧॥
దక్షిణపాదంబు దగనుంచునట్లుగా।
ముందుగాదాటించి మోదమలరంగ॥శ్రీశివా॥౧౬౨
అంతఃపురంబున కతిసంతసముమీర।
నగ్రిప్రవేశించి రతివినోదమున॥శ్రీశివా॥౧౬౩॥
మరకతతోరణ మహనీయమైయొప్పి।
ముత్యములజాలల్లు ముద్దులొలుకంగ॥శ్రీశి॥౧౬౪॥
స్వర్ణవితానము ల్చకచ్చవైయొప్పార।

పెండ్లిముత్తైదులతోను బేర్మిగానున్న॥ శ్రీశి॥౧౬౫॥
మంగళదేవిక మంజులముగానున్న।
సుందరకళ్యాణమందిరమునందు॥ శ్రీశివా॥౧౬౬॥
చిత్రాంబులైనట్టి చిత్రకంబళములు।
చెన్నొందునచ్చోట శ్రీమాయురుడు॥ శ్రీశి॥౧౬౭॥
సింహాసనమునందు జెలువొప్ప గూర్చుండి।
తగుజనంబుల నెల్లదగుబోలనుంచి॥ శ్రీశివా॥౧౬౮॥
వాచకంగీలమునయు మంగళధ్వనుల।
నానందమొందించె నఖిలలోకులను॥ శ్రీ॥౧౬౯॥
ఆసమయంబున నతిసుందరాంగియగు।
నమరాంగనయొకర్తె యతివేడుకలర॥ శ్రీశి॥౧౭౦॥
పెండ్లికుమారునకు ప్రేమతో దలయంటె।
కరకంకణంబులు ఘల్లుమని మ్రోయ॥ శ్రీశి॥౧౭౧॥
కొందరమరాంగనలు కూమి శ్రీశివునకు।
గంధామలకమునుంచి కడువేడుకలర॥ శ్రీశివా॥౧౭౨॥
మంగళస్నానముప్పొంగుచును జేయించి।
శ్రీషాంబరములను జెలువొప్పనిచ్చి॥ శ్రీ॥౧౭౩॥
దివ్యభూషణముల దేజరిల్లగజేసి।
శోభనతిలకమును సొంపుగానుంచి॥ శ్రీశివా॥౧౭౪॥
కజ్జలంబును గనుల కమనీయముగదీర్చి।

శ్రీకరంబుగ జెలులు శ్రీగౌరి జేరి॥శ్రీశివా. ౧౭౫॥
సంపెగ తైలమున సఖియొక తెతలయంటె।
జలజలోచనయొక తె జలకమాడించె॥శ్రీశి॥౧౭౬॥
తడియొత్తెనొక తె పుత్తడిబొమ్మకంపుచే।
చీనాంబరమునిచ్చె చెలియయొక్కర్తె॥శ్రీ॥౧౭౭॥
మణిభూషలుదగిల్చె మానినీమణియొక తె।
సుందరతిలకమిడె సుదతియొక్కర్తె॥శ్రీశి॥౧౭౮॥
పూవులుముడిచెను పూబోణియొక ర్తె।
శివుచెంతజేర్చెను శ్రీగౌరినొక తె॥శ్రీశివా॥౧౭౯॥
దేవదుందుభులపుడు దివ్యముగమ్రోగె।
అప్సరస్త్రీలాడి రతిరమ్యముగను॥శ్రీశివా॥౧౮౦॥
గంధర్వకిన్నరులు ఘనముగబాడిరి।
కుసుమవృష్టిని సురలుగురిపించిరపుడు॥శ్రీశి॥౧౮౧
సర్వజనంబులు సంతోషభరితులై।
యద్భుతమగ్నులై యవుడుండిరంత ॥శ్రీశి॥౧౮౨
అచ్యుతునాజ్ఞచే నజుడుపురోహితుం।
డగుచుబ్రహ్మాసనమందుగూర్చుండె॥శ్రీశివా॥౧౮౩॥
సర్వదేవతలును సనకాదియోగులు।
సప్తర్షిముఖ్యులు సకలమునివరులు॥శ్రీశివా॥౧౮౪॥
వరగనరుంధతీ ప్రముఖపతివ్రతలు।

కనులపండువుగాగ గనుగొనుచునుండ॥శ్రీశి॥౧౮౫
అంకురార్పణ సిద్ధనలరుచు గావించి।
ఫలదానములు బ్రహ్మాదుల కిప్పించి॥శ్రీశి॥౧౮౬॥
వేదోక్తమార్గంబు విధియొప్పుచుండగ।
తెరవైచె సద్వధూవరుల మధ్యమున॥శ్రీశివా॥౧౮౭
లగ్నాష్టకంబులు లలితముగ భూసురులు।
చదివిరిట్లనుచును సరవితోనపుడు॥శ్రీశివా॥౧౮౮
వధూవరాభ్యాంవరదా భవంతనుచ।
కుర్వంతు మంగళం సర్వదాయనుచు॥శ్రీ,శి॥౧౮౯
పఠియించుచుండంగపరమ సంతోషమున।
తెరతొలంచె మైత్రీవరకౌతుకమున॥శ్రీశి॥౧౯౦॥
ఆసమయంబున సభవునకంబికయు।
తెరయెత్తె సంతోషశరధి పెంపొంద॥శ్రీశి॥౧౯౧
మంగళధ్వనులెల్ల మహనీయముగమ్రోయ॥
హిమవంతుడపుడు తనయింతియును దాను శ్రీ॥౧౯౨
గౌరిచేలక్ష్మికి గడుపూజచేయించి।
సంతుష్టులగుచును సలలితంబుగను॥శ్రీశి॥౧౯౩॥
తనలజ్జచేతను తలవంచుకొనియున్న।
తనయనుద సముదమునగనుచుకొనుచు॥శ్రీ॥౧౯౪॥
పసిడిపళ్లెమునందు పసుపటిపదములు।

కడిగిదంపతులపుడు కడు మోద మొప్ప॥శ్రీ॥౧౯౪॥
సాలంకృతంబుగా సకలవిభవంబుగా।
కన్యకనునర్పించె కర మొప్పగాను॥శ్రీశివా॥౧౯౫॥
పరమసంతోషమున పాణిగ్రహణంబు।
శ్రీశివుడు చేసెను జాలువొప్ప గాను॥శ్రీశి॥౧౯౬॥
అంతగుడజీరకము నంపికశిరమునపై।
ముంచిసప్తపదంబు లెంచివొప్పించె॥శ్రీ॥౧౯౭॥
బాలేందుధరమూర్తి పార్వతికంఠమున।
మంగళసూత్రిమును మహితముగగట్టె॥శ్రీ॥౧౯౮
ముత్యములతలంబ్రాలు ముదిత యీశునిపైని।
యీశుండు ముదితపైనింపు మీరగను॥శ్రీశివా॥౨౦౦॥
ఒకరిపయి నొకరును నొప్పుగా బోయుచు।
నున్నంతనానంద మొందిరందరును॥శ్రీశివా॥౨౦౧॥
అపుడు పేరంటాండ్రు హర్షముబ్బంగ।
బేమీరనటు బాడిరి పెండ్లి పాటలను॥శ్రీశివా॥౨౦౨

ఆనందభైరవి- ఏకతాళము.

శ్రీలక్ష్మీదేవినిశ్రీహరినీబోలి। యీదంపతులు యెపుడు నింపొందవలయు। పుష్పమును సౌరభము బొందినయటులు। యిర్వురూవరు లెపుడు నెనయంగవలయు॥ చిన్మిమాగౌరమ్మ చెన్నైనచూపు। వ

లపద్మమాలలై వరలుహారునకును। జెన్నారుపు
ష్పముల చేరెత్తినట్లు। కన్నెయాపార్వతి కాపుర
ము వెలయు॥ కొడుకులకోటవయి కొమరొందవల
యు। కడువేడుకలతోను కడుపుచల్లగను ॥౨౦౩॥

రేవగుప్తి - ఆదితాళము.

శోభనమేయీశునకు। శోభనమే గౌరికిని। శోభన
మేరజతాద్రి శుభనిలయశంభునకు। శోభనమే॥ ర
త్నాలహారతులు। రమణులుమీరియరమ్మా। శర్వాన
కు శాంకరికి। సర్వశుభంబులునొప్ప॥ శోభనమే॥
కర్పూరహారతులు। కడు వేడుకలలర। కాంతలుమీ
రియరమ్మా। కాంచనపాత్రిలనునిడి॥ శోభన॥ ౨౦౪

మంగళగౌరీరాగము ఏకతాళము.

మంగళముశంభునకు। మంగళము పార్వతికి।మంగ
ళముజగదేకమాన్యులకును। మంగళమువృషరా
జ। మానితతురంగునకు। మంగళముమాసర్వ। మం
గళకును ॥జయమంగళం నిత్య శుభమంగళమ్॥
గౌరీవిలసితకేళి। కలితదృగ్పాళి। సిహారకరమాళి।
నీకునివ్వాళి॥ నివ్వాళిదిగొగైకొమ్మ। నీకిచ్చెదము
గారమ్మ। శ్రీశివునిముద్దులగుమ్మ। చిన్నిబంగారు
బొమ్మ॥నివ్వాళి॥ శ్రీవిష్ణువక్షమున। జెలువొందు

శ్రీదేవి! భావజునితల్లి! సద్భావవల్లీ! శ్రియునై
దువతనము! సేమమాయావ్యమును! తగగౌరిదే
విని దయచేసెను ॥జయమంగళం॥౨౦౫॥

అంతటనాభృంగి యంగనవైఖరిని।
కొప్పునుసవరించిగొబ్బుననువచ్చి ॥శ్రీశివా॥౨౦౬
పార్వతిదగ్గఱకేగి పణతులనిచ్చెంచి।
యనియెనిట్లనుచు నాయంబికను జూచి ॥శ్రీశి॥౨౦౭॥
ఇంతదలచినదానవేలమా బెదరింపు।
మాటలకు జంకెదవుమానినిరోషివు ॥శ్రీశివా॥౨౦౮
కుందేళ్లుబెదరునే పొందుగాతాటాకు।
చప్పుళ్లకెందైన జగతిలోపలను ॥శ్రీశివా॥౨౦౯॥
మీరిద్దరొకటైనమేలుగానాకైని।
దయదప్పవద్దనితగగౌరియుంటి ॥శ్రీశివా॥౨౧౦॥
అటులనాపైదయ నరయనుంచదోలేక।
చీకాకుచేసి నను కాకజెందెదవో ॥శ్రీశివా॥౨౧౧॥
అటులైనజెపుము నే నెటకైన నేగెద।
ననగౌరిదలవంచియతిలజ్జనుండె ॥శ్రీశివా॥౨౧౨॥
అంతటకలవాణి యాభృంగితోననియె।
లజ్జచేనిటులుండెలలితాంగియిపుడు ॥శ్రీశివా॥౨౧౩॥
కళ్యాణకాలంబు గానకోపమువలదు।

నిలునిలుమనె శృంగియలరుచునుబ్బి॥శ్రీశివా॥ ౨౧౪

నాపనిబాగాయె నయముగాననుచును।

వేశ్యాజనంబులను వెక్కిరింపుమను॥శ్రీశివా॥ ౨౧౫

పరపరివిధముల ప్రజలనవ్వింపుచు।

వికృతపు చేష్టలు వెస జేయుచుండె॥శ్రీశివా॥ ౨౧౬॥

అంతనాహోమవంతు డఖిలసురభూసురుల।

నతివేడ్కనలరించి యతివినయమొప్ప॥శ్రీశి॥ ౨౧౭॥

చందనతాంబూల సకలపరిమళవస్తు।

సంభారసమితిచే సంతుష్టిపరచె॥శ్రీశివా॥ ౨౧౮॥

వామదేవునుతన వామభాగమునందు।

వామలోచనయుండవర నియమమొప్ప॥శ్రీ॥ ౨౧౯

విధ్యుక్తముగ హోమ విధిని గావింపుచు।

దంపతులతిశోభదనరారిరప్పుడు ॥శ్రీశివా॥ ౨౨౦॥

పరమేష్ఠి చేయించె వరలాజహోమంబు।

మైనాకుడింపొందమహనీయముగను॥శ్రీశి॥ ౨౨౧

అంతస్థాలీపాక మతిశుభంబుగజేసి।

కులదేవతనునిల్పి కూర్మితోనప్పుడు॥శ్రీశి॥ ౨౨౨॥

ఆపైనరుంధతి నతివేడ్కజూపించె।

హిమవంతుడంతటహితముదీపింప॥శ్రీశివా॥ ౨౨౩।

బ్రహ్మాదిసురలకు బ్రాహ్మణశ్రేణికి।

నఖిలజనాళికి నతిశయంబుగను ॥శ్రీశి వా॥౨౨౮॥
కిన్నాని సేతులు కాలువలైపార।
చాయపప్పులుమంచిశాల్యన్నములును॥శ్రీశి॥౨౨౯॥
శాయబూరెలు చాగ్లుకలగాయిపులుసులు।
నూరగాయులురుచులూరుపచ్చడులు॥శ్రీశివా॥౨౨౬
బూరెలుకకర రాల్ పూతల్లులాడాలు।
బరిఫీజిలాబీలు పరగనరిశలును ॥శ్రీశివా॥౨౨౭॥
పెన్నప్పములు మరియువివిధభక్ష్యంబులు।
పాయసములుపంస్లుపానకంబులును ॥శ్రీశి॥౨౨౮॥
వరుగులప్పడములు వడియమ్ముల్ మ్మునాల్।
మీగడపెరుగుపాల్ మిసిమిజున్నులును॥శ్రీశి॥౨౨౯
అపరంజిపళ్లెములందు వడ్డింపించు।
నందరును భుజియించి రానందమొంద॥శ్రీశి॥౨౩౦॥
ఆపయినగనేత యతివినోదముతోడ।
తాంబూలమత్తరువుదగచందనంబు ॥శ్రీశి॥౨౩౧
కర్పూరహారముల్ ఘనతసమర్పించు।
సంతసముపొందుచు పరసముగవారు॥శ్రీశి॥౨౩౨॥
సౌధాంతరములందు సరవితోనుండిరి।
మహాదుత్సవంబునమహానీయముగను॥శ్రీశి॥౨౩౩॥
కాంతలంతటిలోన కడుమంగళంబొప్ప।

కనకదివ్యరత్న కాంత పాత్రముల॥ శ్రీశి॥ ౨౩౪
బ్రాకెన్నజేసిరి బలువైభవముమీర।
నాశీర్వదించిరయ్యెడు భూసురులు॥ శ్రీశివా॥ ౨౩౫
దొంగవేలిమిచేత దొంగిలిశర్వుండు।
లలనామణిసరస లలితహృదయంబు॥ శ్రీశి॥ ౨౩౬॥
ముల్లోకములవారు మోదసంభరితులై।
భోజనాదియథేష్ట భోగములనలరి॥ శ్రీశివా॥ ౨౩౭॥
బహుమానములు చెంది భాసిల్లుచుండిరి।
సకలసుఖస్థితి సంపూర్ణులగుచు॥ శ్రీశివా॥ ౨౩౮॥
అంతనమరాంగనలాదంపతులకపుడు।
జాఫరానలుగులు జానుగానుంచి॥ శ్రీశివా॥ ౨౩౯॥
మగువపేర్మగనిని మగనిపేర్మగువను।
దగజెప్పుడనుచును దలుపులనువేసి॥ శ్రీశివా॥ ౨౪౦॥
పరిహాస వాక్యముల పాటలపాడుచు।
ఉత్సాహముననుండి రొప్పుమీరుచును॥ శ్రీశి॥ ౨౪౧
అయిదవదినమందు నలశేషహోమంబు।
సలిపినాకబలికి సమకట్టిరంత॥ శ్రీశివా॥ ౨౪౨॥
అప్పుడుకొందరు కప్పురగంధులు।
మూర్తినిటుబాడిరి కౌటనములపాట॥ శ్రీశివా॥ ౨౪౩॥

తోడిరాగము ఆదితాళము.

ఇంతిరావె చామంతి। బంతిరావెరత్నాల। దొం
తిరావె మన్మథుని। దంతిరావె॥ ౧॥ కన్నెరావె చిన్ని
పొన్న। గున్నరావె యన్నెల। మిన్నరావె కప్పురం
పు దిన్నెరావె॥ ౨॥ కలికిరావె మరునిపూ। ములికి
రావె విలుకల। కొలికిరావె వజ్రాలపలకరావె॥ ౩॥
కస్తూవిల్తుతేజిరావె। కొమ్మరావె ముద్దుల। గుమ్మరా
వె కనకంపు। బొమ్మరావె॥ ౪॥ బోణిరావె సైకత।
శ్రోణిరావె యంబుజ। పాణిరావె యళికుల వేణి
రావె॥ ౫॥ సఖియరావె చెలియరావె। చానరావె
చేడెరావె। కొమ్మరావె కోర్ణములను। గోరిదంతము
॥ ౬॥ గరుడవాహనములుమంచి। గౌరికుంకుమము
లురత్న। సరులుపచ్చగన్నెరులు। సన్నదినసులు।
కలయగాను కూర్చిహస్త। కంకణధ్వనులు మెరయ।
నందెచప్పుళ్లు ఘల్లుమనగ దంచిరి॥ సువ్విసువ్వి సువ్వి
సువ్వి సువ్విసువ్విసువ్విసువ్వి। సువ్వియాని పాడిరీ
సుదతులందరు॥ ౭౪౪॥

అంగనలందరు నతిచిత్రతరముగ।
ముత్యాలముగ్గులను మోకమునను౦చు। శ్రీ॥ ౭౪౫॥
నాగప్పసాని యైన యరుంధతీదేవి।

తద్విధులెల్లను దనరీతి జేసె॥ శ్రీశివా॥ ౨౪౬॥
సతిపతులచ్చోట సంతోషమునసుండ।
హరియిచ్చెకానుకమైశ్వర్యములను॥ శ్రీ॥ ౨౪౭॥
మామయల్లునికిచ్చె మాణిక్యకిరీటాదిక।
బహుమూల్యవస్తువుల్ బరిఢవిల్లగను॥ శ్రీశి॥ ౨౪౮॥
బ్రహ్మేంద్రముఖ్యులు బహురీతికట్నముల్।
చదివించియొసగిరిసకలభాగ్యములు॥ శ్రీశి॥ ౨౪౯॥
తారాడనీరాడు గొబ్బునదోణకింద।
యత్రివేట్కబాన్పెక్కి రాసతీపతులు॥ శ్రీ॥ ౨౫౦॥
యువతులుయ్యాలలోన నొకబొమ్మనుంచుచు।
సలపసంపుముజిక్క యతిహాస్యమునను॥ శ్రీశి॥ ౨౫౧॥
జోజోయుటంచును జోలలుబాడిరి।
చోద్యమునందరికి హృద్యంబుగాను॥ శ్రీ॥ ౨౫౨॥
మిథునతాంబూలముసైలతలాదంపతులె।
కిచ్చిరంతవసంత మెలమిచేబూని॥ శ్రీశివా॥ ౨౫౩॥
ఒకరిపైనొకరను నొగిజల్లులాడుచు।
మంచిరిసంభ్రమం బొప్పచును మెరయ॥ శ్రీ॥ ౨౫౪॥
శ్రీవిష్ణుదేవుండు శ్రీశంకరునిమీద।
మరదిహావిసచేసి వరకౌతుకమున॥ శ్రీశివా॥ ౨౫౫॥
కనకనాగములను కరములచేబూని।

కుంకుమోదకమును గూర్మిచేజల్లె॥ శ్రీశివా॥ ౨౫౬॥
శ్రీపతివక్షమున జెలువొందుక సుభ।
కనకాంబర ప్రభ గాంచియీశ్వరుడు. శ్రీశి॥ ౨౫౭॥
కుంకుమోదకమని పంకము గనూహించి।
భ్రమచేతనుండెను పరమహర్షమున॥ శ్రీ॥ ౨౫౮॥
శ్రీభామినీఘలు చెలగి పార్వతిపైని।
చెలరేగి జల్లిరి యులవసంతమును ॥ శ్రీశివా॥ ౨౫౯॥
పంకజాక్షుడు తన పత్నులదరికేగి।
మూడుహస్తములచే ము ఖ్వారనుబట్టి॥ శ్రీశి॥ ౨౬౦
సోదరియునగును కుసూటిగానందిచ్చె।
వాలవ చేతిచే నలవసంతమును ॥ శ్రీశివా॥ ౨౬౧॥
అందిచ్చె వారిపై నాగారిచేతనె।
చింపెవసంతమును నిండువాసమున॥ శ్రీశివా॥ ౨౬౨॥
శ్రీశారదాదేవి చెలగి మేనకతోడ।
సరసమాడుచునతిసంతసము జెందె॥ శ్రీశివా॥ ౨౬౩
నలువయు జెలిమిచే నగరాజుతో గూడ।
సయ్యాటలను జెలగె సరసంబులలర॥ శ్రీశివా॥ ౨౬౪
సర్వలోకజనులు సంతోషమొందుచు।
నప్సరసలతో గూడియతికౌతుకములు శ్రీశివా॥ ౨౬౫
ఓలలాడిరిమిగుల నుత్సాహము లుమీర।

జల్లులాడవసంత జలధినీదుచును ॥ శ్రీశివా॥ ౨౬౬॥
అంతనాహిమవంతు డానందభరితుడై।
భూరిసంభావనలు భూసురులకిచ్చి ॥ శ్రీశివా॥ ౨౬౭॥
విద్వాంసులకుమరియు వివిధవిశేషజ్ఞు।
కవినటగాయక నివహంబునకును ॥ శ్రీశివా॥ ౨౬౮॥
అమిత సత్కారము లమరంగజేసి।
వందిమాగధులకయివారముల్బెలగ ॥ శ్రీశివా॥ ౨౬౯॥
అప్పుడాహిమవంతు డంబికనుశంభునకు।
నప్పగించుటకుదా నొప్పుగాదలచి॥ శ్రీశివా॥ ౨౭౦॥
విడిదికిదోడ్కొని విభవమింపొందగ।
శివుచేతిలోగౌరి చెయ్యుంచిపలికె॥ శ్రీశివా॥ ౨౭౧॥
పరమేశవినుమిపుడు ప్రార్థనసీవునా।
యల్లుడవౌటచే నయితిధన్యుడను॥ శ్రీశివా॥ ౨౭౨॥
పూర్వముచేసిన పుణ్యముల్ ఫలియించె।
సకలభాగ్యంబులు సమకూరెనింటి॥ శ్రీశివా॥ ౨౭౩॥
తనుతేమియెరుగదు పసిబిడ్డయీబాల।
బుద్ధులన్నియు నేర్పిదిద్దుకోవలెను ॥ శ్రీశివా॥ ౨౭౪॥
సర్వజ్ఞులగుమీకు సరణిదెలియనిదేమి।
పుత్రికాప్రేమచే బూనిపల్కితిని ॥ శ్రీశివా॥ ౨౭౫॥
సర్వభారంబును సకలబాధ్యతయును।

సర్వేశ్వరా నీదె సమకట్టి చూడ॥ శ్రీశివా॥ ౨౮౬॥
అనుచు ప్రెనిజూడి యట్టహాస్యతోననియె।
నా శ్రీశిఖామణి నాముద్దుపట్టి॥ శ్రీశివా॥ ౨౮౭॥
పతియగ్నిగురుడన్న పరమైనమన్నను।
సపథనంబనగను నాసదాశివుడె॥ శ్రీశివా॥ ౨౮౮॥
అతిభక్తి పతిమాట కడుగువాలకుమన్న।
..త్తయిల్లాతంబు పలుకు నెపుడు॥ శ్రీశివా॥ ౨౮౯॥
అనుచును బోధించి యచ్యుతునీక్షించి।
కన్నీరు గురియించుచు గద్గదికననియె॥ శ్రీశివా॥ ౨౯౦॥
నారాయణస్వామి నయముతో నీమామను।
నీపుత్రిగా చూచి నెనరుంచు మరియు॥ శ్రీశివా॥ ౨౯౧॥
కాపాడవలెనని కలకలలాడిన।
జనులకు బాష్పములు జలజలను రాలె॥ శ్రీశి॥ ౨౯౨॥
అంత హిమవంతున కనియె శ్రీవిష్ణుండు।
చింతనీకేటికి సంతసము వేళ॥ శ్రీశివా॥ ౨౯౩॥
ఈవధూవరులెపుడేకశరీరులయి।
యెడబాయకుండుదు రెలమిమీరగను॥ శ్రీశి॥ ౨౯౪॥
అనవిని హిమవంతుడతిసముచితంబుగా।
దాశునకలు నకు మూర్తితో నపుడు॥ శ్రీశివా॥ ౨౯౫॥
రత్నజవాహీరి రహిమీరుచున్నట్టి।

కనకాంబరములును ఘనతజెన్నొందు॥శ్రీశి॥ ౨౮౭॥
రథగజాశ్వపదాతి రాజితబలములు।
దాసదాసీజనములు దగియుండగాను॥శ్రీశివా॥ ౨౮౭॥
ఆరణంబుగానిచ్చి యతికుతూహలముతో।
నథవునిపార్వతిని నంపకముచేసె॥శ్రీశివా॥ ౨౮౮॥
అనతిదూరంబేగి యాహిమవంతుండు।
మరలియింటికివచ్చిమహనీయముగను శ్రీ ౨౮౯
బ్రహ్మాదిసురలకు బంధులకుమిత్రులకు।
కట్నంబులర్పించి కడుసత్కరించి॥ శ్రీశివా॥ ౨౯౦॥
తానునుదనపత్ని తగురీతిశ్రీభూమి।
నీళాసమేతుడగు నీరజదళాక్షు॥ శ్రీశివా॥ ౨౯౧॥
పదములుభక్తిచే బాగుగాపూజించి।
వైకుంఠమునకనిపె వరభక్తియలర॥శ్రీశివా॥ ౨౯౨
బ్రిహ్మాములందరు పరమసంతుష్టులయి।
ఆశిషంబులుచేసి యతివేడ్కజనిరి॥శ్రీశివా॥ ౨౯౩
బ్రిహ్మాదిసురలును పరమఋషివర్యులును।
వెంటనేతేరంగ విభవమలరంగ॥శ్రీశివా॥ ౨౯౪
అలఘులవర్షాము లమరులుగురియింప।
నప్సరసస్త్రీలంత నతివేడ్కనాడ॥శ్రీశివా॥ ౨౯౫
దేవదుందుభులును తేజరిల్లగమ్రోయ।

మంగళవాద్యముల్ మహిమరెట్టింపఁ॥ శ్రీశి॥ ౨౯౬
ప్రమథగణాదులు పార్శ్వములందుండ।
పరమభక్తినిబరాబరులుసేయంగ॥శ్రీశివా॥౨౯౭
ముత్తైదులందరుసుమముక్తాక్షతలుజల్ల।
వెలఁదులందరుగూడి నివాళులొసఁగ॥శ్రీశివా॥౨౯౮
మంగళాశీర్వాద మహిమజెన్నొందంగ।
పెండ్లిపాటలశోభ బెంపొందివెలయ॥శ్రీశి॥ ౨౯౯
శ్రీకరములయిమిగుల చెలువొప్పుచున్నట్టి।
కల్యాణకేతువుల్ ఘనతమీరఁగను॥ శ్రీశివా॥ ౩౦౦
శ్రీపార్వతినిగూడి శ్రీశంభుడరుదెంచె।
కైలాసగిరికిని కడుసంతసమున॥ శ్రీశివా। ౩౦౧
అంతశివాశివు లంతఃపురంబునకు।
జనిప్రవేశించిశుభ సదనంబునందు॥ శ్రీశివా। ౩౦౨
బ్రహ్మాదిసురలకు బహువిధములచేత।
సత్కారములుచేసి సరవినంపించి॥ శ్రీశివా॥ ౩౦౩
సుముహూర్తమునవారు శోభనమింపొంది।
యలరుచునుండిరి సలలితంబుగను॥శ్రీశివా॥౩౦౪।
ఇతరేతర ప్రేమలతిశయిల్లుచునుండ।
సకలసౌఖ్యంబుల నలరిరెల్లప్పుడు॥ శ్రీశివా॥౩౦౫॥
ఇటులుండ నొక్కనాఁడేకాంతమునలోన।

పార్వతిశాపంబు పరికింప దలచి॥శ్రీశివా॥౩౦౬॥
తనమాలిని గాంచిన పగిదియున్నగాంచెను।
తరుణిగాజేసి మంతనమునను ఉండె।శ్రీశివా॥౩౦౭
ఆర్య చెలియొక్క తెయాపంతగనుగొని।
యతికోపమునవచ్చి యింటికపు దెల్పె॥శ్రీశి॥౩౦౮
అతికోపమలరంగ నప్పార్వతీదేవి।
చిగవిరలాడుచు చెలితోడ ననియె।శ్రీశివా॥౩౦౯।
పయింతతోగూడె నెలనాగనాపతి।
సందియుంబుంచక సఖదెల్పగదవె॥శ్రీశివా॥౩౧౦
అనవిని చెలిబలెక నదెవచ్చెభృంగియు।
నాతఁడడిగిన నంతయును దెలుపు శ్రీశివా॥౩౧౧॥
అని చెప్పగాభృంగి నంబికయదుగంగ।
కలహముచాబెంచ దలదియుట్లనియె॥శ్రీశి॥౩౧౨।
పటిహాపంబున బోటిశిరమందు।
సూటిగానుంచెనుచాటుజేయుచును।శ్రీశివా॥౩౧౩
తల్లివద్దనుచూలు దాచంగవలదని।
నిజముజెప్పితినమ్మ నెనరుంతువనుచు॥శ్రీశి॥౩౧౪।
ఈమర్మమంతయు మీమదినుంచవలె।
బయలుబడినను మాకు బాములొగివచ్చు।శ్రీశి॥౩౧౫
అనవిని పార్వతి యతివేగమున లేచి।

యలక చేగృహమునకునతి వేగజనియె ॥శ్రీశి॥ ౩౧౬॥
అచటును నేలపై ననుసుసురనుచును।
బొరలుచుబడియుండిపొలుపుదప్పచును॥శ్రీశి॥ ౩౧౭
కన్నులనీర్నిండి కలవాణినింగాంచి।
యింటరో వినుమమ్మ యీవింతవార్త।శ్రీశి॥ ౩౧౮॥
కలనైననెరుగము గదవెయిట్లవ్రన।
గంగనుఁజూడెనట గరళకంఠుండు ॥శ్రీశివా॥ ౩౧౯॥
చిన్ననాటినుండి శివుదేవుడటంచు।
నధికతపోనిష్ఠ నతనిజేకొంటి॥ శ్రీశివా॥ ౩౨౦
అహహా పూర్వపుణ్యమర యనిట్లుఫలించె।
నేనిసేయుదు నెఖ్ఖడింతపనికొప్పె॥శ్రీశివా॥ ౩౨౧
అతివరో నామాట కడుగుదాటనివాడు।
గయ్యాళిగంగను గలసిరాడాయె ॥శ్రీశివా॥ ౩౨౨॥
కులగోత్రజనాన్నేను కూలనౌనన్విడచి।
నెలతనొకతెను దనతలమీదనుంచె ॥శ్రీశివా॥ ౩౨౩॥
ప్రాణేశుదయలేని పరమభాగ్యంబేల।
తక్కుదనమదియేల జవ్వనంబేల ॥శ్రీశివా॥ ౩౨౪॥
అనుచుజింతా క్రాంతయైనగౌరినిఁజూచి।
కన్నీరునించుచు గలవాణియనియె॥శ్రీశివా॥ ౩౨౫॥
తంతిగమన్నరో యింతచింతనీకేటికి॥

నేనునీదాననైనేనరుగానుండ॥శ్రీశివా॥ ౩౨౬॥
నీపతినిను జేరి నెమ్మి చేసప్పుడు।
బ్రీతిమాలినటుజేతు నతిశయంబుగను॥శ్రీశి॥ ౩౨౭॥
వారీమణులకెల్ల వాధులగూర్వంగ।
జెలికత్తెతేగారె చెలిమిమీరగను॥శ్రీశివా॥ ౩౨౮॥
సెలవొసంగుము వేగ శివుఁదోడిదెచ్చెద।
ననిజననిశంకరు గని మెప్కరిచనతఁడు ॥శ్రీశివా॥ ౩౨౯॥
మంతనంబునదన కాంతవార్తలనడుగ।
వింతగానగుచునాయింతి యిట్లనియె॥శ్రీశివా॥ ౩౩౦॥
అంబిక చెలికత్తె నై కెలంగుచునుండి।
యంతరంగపుమాట లర్థమా తెలుప ॥శ్రీశి॥ ౩౩౧॥
అనవినిశంకరుండనియె గలవాణితో।
గంగవృత్తాంతమును గౌరివిన్నదియో॥శ్రీశి॥ ౩౩౨॥
అనియడుగనాయింతి యనియెశంకరునితో।
దాపేల జెప్పెద దగవినుముదేవ॥శ్రీశివా॥ ౩౩౩।
సర్వము దెలిసెనీ సతికిమహాదేవ।
యతితెంపుచేసుండె నార్యవిరసముగ॥శ్రీ॥ ౩౩౪।
కావునగౌరికి గనబడకుండగ।
వచ్చితివిటకును వరదేవగతిని॥శ్రీశివా॥ ౩౩౫॥
కలవాణినైనను దెలుపదామెనాకింత।

యనిననునిందింతువనుచు జెప్పితివి॥ శ్రీశివా॥ ౩౩౬॥
అనవిని యాహారుం డాత్మతల్లడమొంది।
చిత్రమురుషులన చెలికిట్లనియె ॥ శ్రీశివా॥ ౩౩౭॥
దాక్షాయణినినేను దగవెరుంగుదునని।
కోమలివద్దికిగొబ్బునను జనియె ॥ శ్రీశివా॥ ౩౩౮॥
వినయమునవచ్చిన విభుజూచి పార్వతి।
శిహాలుముసుంగిడి శయసంచియుండ॥ శ్రీశి॥ ౩౩౯॥
ఈశ్వరుండుదరిజేరి యింతితోనపుడనియె।
కొమ్మరోనాపైని కోపమెటుగలిగె॥ శ్రీశివా॥ ౩౪౦॥
పలుకవేటికినిన్ను బలుమారు బ్రార్థింప।
కఠినత్వమేరీతి గలిగెనాపైని ॥ శ్రీశివా॥ ౩౪౧॥
చలముచాలించుమని పలికినపతివైపు।
చురచురంజూచుచు సుదతియిట్లనెను॥ శ్రీశి॥ ౩౪౨॥
చాలుచాలొప్పిమ్మిట మేలమాడుటదేల।
యెన్నినేర్చితివహాహా యింతలోపలనె॥ శ్రీ॥ ౩౪౩॥
ఈవగలీమాయ లీతక్కులెల్లను।
కుటిలాత్మనావద్ద కొరగావుసుమ్ము ॥ శ్రీశివా॥ ౩౪౪॥
పైనమృతంబును బరగలోనవిషంబు।
గలనీమమాటలు గడునమ్మదగునె॥ శ్రీశివా॥ ౩౪౫॥
నీస్వభావంబెల్ల నిక్కంబుగాదెలిసె।

నీప్రియను గూడుమునిశ్చితంబుగను॥ శ్రీశివా॥ ౩౮౬॥
కైలాససుందర కందరస్థలులందు।
విహరించుమింపొంది విలసితంబుగను॥ శ్రీశి॥ ౩౮౭॥
అనుచు కలస్వనమలర నశ్రులునించ।
హరుడు కౌగిట జేర్చి యతివనలరించి॥ శ్రీశివా॥ ౩౮౮॥
కన్నీరు మడుచుచు గడు లాలనము జేసి।
యంతరంగక్షోభ మింతికెడబాపి॥ శ్రీశివా॥ ౩౮౯॥
నీకువశ్యుడనౌదు నిరతంబుననుచును।
నపిలాసముగనుండె శివతో శివుండు॥ శ్రీశివా॥ ౩౯౦
అంతటనాగంగ యచటికే నేతేర।
నంబికగనియనె నధికకోపమున॥ శ్రీశివా॥ ౩౯౧॥
ఎందుండివచ్చితి విందుధరు చెంతకు।
ఎంతయోయుంటినీ కెంత సాహసమె॥ శ్రీశి॥ ౩౯౨॥
ఎంతనిజలికెద యింతిరో వినుమమ్మ।
చెంత నేయుంటినా కాంతుదయజెంది॥ శ్రీశి॥ ౩౯౩॥
అనిగంగబలుకంగ హరుడీశ్వరింజూచి।
యనునయ మొప్పంగ నపుడిట్టులనియె॥ శ్రీశి॥ ౩౯౪
సాధారణులవలె సహ్యమించుక లేక।
జగడంబులాడుట సతులకనుదగునె॥ శ్రీశివా॥ ౩౯౫॥
అనినగౌరీగంగ లలుకలువిడనాడి।

యన్యోన్యమైత్రిచే నలరారుచుండి ॥శ్రీశి॥ ౩౫౬॥
బాలేందుధరగూడిబహుసౌఖ్యసంపత్తి।
ననుభవింపుచునుండిరతిహర్షమునను ॥శ్రీశి॥ ౩౫౭॥
ఇటులుండగాపుత్రుడీశ్వరునకుగల్గె।
నింద్రాదిదేవత లింపొందయలరి ॥శ్రీశివా॥ ౩౫౮
పరమేష్ఠిబల్కినపలుకునిజంబాయె।
ననిశంభుసన్నిధికరిగియిట్లనిరి॥శ్రీశివా॥ ౩౫౯॥
శంభో మహాదేవ శంకరజగదీశ।
మముబ్రోవుదయతోనుమహనీయమూర్తి॥శ్రీ॥ ౩౬౦
తారకాసురుడనుదైతేయుబాధచే।
నతికష్టములుబొందియరుగుదెంచితిమి ॥శ్రీ॥ ౩౬౧
వానినివధియింపవశముగాకున్నది;
సేనకుసేనానిశేనిహేతువున॥శ్రీశి॥ ౩౬౨॥
కావునమీసుతుకడువేగముననిచ్చి।
వానివధింపించవలయునో దేవ॥శ్రీశివా॥ ౩౬౩॥
అనవినిశంకరుండాకుమారస్వామి।
నతితోషమునదిచ్చియంపెనందరిని। శ్రీశి॥ ౩౬౪॥
అంతనాసేనానియాదైత్యువధియించె।
సకలభువనంబులుసంతసముజెందె॥శ్రీశి॥ ౩౬౫॥
సరవితోనికథ జదివినవిన్నను।

సర్వైశ్వర్యుండౌనగు సర్వసంపదలు ॥శ్రీ॥ ౩౬౬॥
వంశాభివృద్ధిగా వర్ధిల్లుచుందురు।
ధరణిలోనా చంద్రతారార్కముగను॥శ్రీశ్రీ॥ ౩౬౭॥
విద్వాంసులకునతి వినయమెలర్పగ।
విశదీకరించెదవిన్నపంబొకటి ॥శ్రీ,శివా॥ ౩౬౮॥
భక్తినే జేసినభవునిపరిణయకథ।
దప్పులొప్పులు సేయవగ్రజ స్తుతింతు ॥శ్రీశి॥ ౩౬౯॥

ఆనంద భైరవి-ఆదితాళము.

జయపార్వతీశ్వరులకు। జయమంగళం ॥అనుపల్లవి॥ సుకవిలోకస్తుత్యులకు। శుభమంగళం॥ నిగమాంతసంవేద్యులకు। నిరుపమచారిత్రులకు। నిఖిలదేవసేవ్యులకు। నిత్యమంగళం॥జయ॥ భక్తరక్షాదీక్షులకు। భవబంధవిమోక్షులకు। ప్రమథగణాధ్యక్షులకు। భవ్యమంగళం॥జయ॥ సామగానలోలులకు। సోమరేఖాధారులకు। సకలశుభదాయకులకు।సర్వమంగళం॥జయ॥ మృత్యుంజయనిశ్శంకభావ।మృదుతరహృద్వాసులకు। సత్యశ్రీస్వరూపులకు। సదామంగళం॥ జయపార్వతీశ్వరులకు జయమంగళమ్॥ ౩౭౦॥

గద్యము.

ఇది శ్రీమన్నిశ్శంకవంశపయఃపారావారరాకా
సుధాకరులును శ్రీమద్వేంకటనిశ్శంకపౌత్రులును,
శ్రీపెద్దన్ననిశ్శంకపుత్రులును, శ్రీసన్యాసమాం
బాగర్భసంజాతులును, సంగమవలసరాజధాన్య
ధినాథులునైనశ్రీమన్మృత్యుంజయ నిశ్శంక
భూపాలునిచే శ్రీమదుమా మహేశ్వర
ప్రీతిగ శ్రీవిశ్వేశ్వరాంకితంబుగర
చియింపంబడినగౌరీవివాహమం
దలి సర్వముం తృతీయా
శ్వాసము.

శ్రీరస్తు. స్వస్త్యస్తు.